కళా-పీఠ ప్రచురణ ౧౧.

# తరంగిణి

(కథాసంపుటి)

●

అడివి బాపిరాజు

కళాపీఠము

హైదారాబాద్. [దక్కన్]

సర్వసామ్యాలుగ్రంథకర్తవి.

ప్రాప్తిస్థానాలు: కళాపీఠము

అ డి వి బా పి రా జు

హైదరాబాదు [దక్షిణ]

2. నవ్యగ్రంథ విక్రయశాల

బ్రా డీ పే ట

గుంటూరు.

ప్రచురణ: డిశంబరు 1945

**వెల 1-8-0 ( బి. జి. )**

**మొదటికూర్పు వేయిప్రతులు.**

**"Meezan" Printing Works,**
**A. C. Guards, Hy'bad.**

ఓం

శ్రీరస్తు.

# అంకితం

దివ్యమధురకవి, అమృతగీతాలాపన గాంధర్వమూర్తి ఆశయమూర్తి
ఊర్వశీప్రియుడు, మాతమ్ముడు

## శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రికి

ప్రేమతో అర్పిస్తున్నాను.

అడివి బాపిరాజు



# విషయసూచిక.

ఓం

# శైలబాల

## ౧

శిథిలమై ఒరిగిపోయిన మండపాలు; ముక్కలై భూపతనమైన అంతఃపురాలు; కూలి వ్రీలిపోయిన గోపురాలు; పాడుపడిగి పోగ్రిగులు పడ్డ దేవాలయాలు; తలక్రిందైన శిఖరాలు; రాలిన విగ్రహాలు ఒకనాడాంధ్రప్రపంచానికి శిరోమణియై శత్రు రాజ్యాలకు నిర్భేద్యమై సమస్త దక్షిణాపథాన్ని ఏకచ్ఛత్రంగా ఏలిన విద్యానగర మహాపురము నేడు నామమాత్రమై, పెద్ద వస్తు ప్రదర్శనశాలయై యాత్రికులను నిశ్చేష్టులను చేసి, కన్నీరు నింపుతున్నది.

ఆనందాన్ని చీకుసల్పుతూన్న ఆ శిథిలత్వంలో ఏదారిని నడుస్తున్నాడో తెలియక, తిరిగినదారినే తిరుగుతూ, ఏదిచూస్తున్నాడో తెలియక చూచినదాన్నే చూస్తూ, కళ్ళకాంతులు శిలాత్వము పొందగా తుంగభద్రా నదీతీరాన, పెద్ద ముళ్ళపొద పక్కనే నాగచంద్రుడు చదికిలపడ్డాడు.

నాగచంద్రుడు చిత్రకారుడు. రసానంద తన్మయుడు మహాశిల్పగానంలా ఆ భయంకరాపస్థితి అతని జీవితాశయాలను భగ్నం చేసింది.

ఇంతలో వెనక ఎవరో అతన్ని తీవ్రదృష్టులతో పరికిస్తున్నట్లయింది. చైతన్యరహితుడై ఉన్న నాగచంద్రునికి ఆ చూపుల తీవ్రత చురుక్కుమని తగిలి మత్తువిరిగే మందిచ్చినట్లయింది. అతడు లేచాడు. వెనక్కి పరికించి చూచినాడు. పెద్దపొద; మరేమిన్నీ కనబడదు. ఆ అదృశ్యవ్యక్తి చూపులు చల్లగా తోచినవి నాగచంద్రుడు ఇదేమని పొదచుట్టూ చూచి. యేదన్న

కానక, పొగమంచు కమ్ముకున్న వ్యోమపథం మరిన్ని చీకట్లు అలుము కోగా, శిల్పివాని విస్మయం పొందుతూ, మళ్ళీ నదిఒడ్డున కూర్చున్నాడు. ఈసారి ఆతనికి నిట్టూర్పు వినబడింది నాగచంద్రుడు లేచి, సగము నిద్రమత్తు తెలుస్తున్నవానిలా తూలుతూ, పొదదగ్గరే నిల్చుని, పొదలోనికి పారచూచి నాడు. అస్పష్టంగా మెడలో హారాల చప్పుడు నాగచంద్రుడు తూలి ముళ్ళడొంకలో పడబోయినాడు. స్పష్టంగా మళ్ళీ నిట్టూర్పు. అది ఘంటా రావమై అతని మెదడులో మోగింది, నాగచంద్రునికి పూర్తిగా మెలకువ వచ్చింది పక్కనే ఉన్న పందిరిలోనుంచి చేతిగొడ్డలితీసి పొద నరకడం ప్రారంభించాడు.

బరెంక, రక్కెస, నాభిలత. అడవిమల్లె, పురుగుడు, పాలకగా, చిట్టిరేగూ విపరీసా వీరభద్రుడై నాగచంద్రుడు అరజాములో నరకిపార వేసినాడు సగము నరికిన ఆపొదమధ్య ప్రత్యక్షము చేయబోయే శిలాబాలిక! పరువము పండించుకొన్న కోటి కోటి సంవత్సరాల యీడు కలిగిన దక్షిణా పీఠభూమి నల్లరాయిలో, స్నిగ్ధాతి స్నిగ్ధమైన చెక్కడం. స్త్రీప్రపంచాన అందం ఏరితెచ్చి, చేర్చిముద్దపోసి ఆ బాలికామూర్తిని శిల్పించినారు. కోల మోము: లో తెరుగని నాసికామూలము. సముద్రప్రవాహ పతనమైన రేఖ, రేక మందార మొగ్గవంపులో తిరిగి ఓష్ఠాంచలముపైన సుడి తిరిగిపోయింది. చిరు నగవున వికసించబోయే ఆమె పెదవులు కొద్దిగా విడి వడి స్విన్నమై, ఈవలావల కాశీగన్నేరు పూల చెక్కిలికుంటలను అలంకరించుకొన్నవి. అధ రము దిగువ నిమ్నమై, చిరుకసాల ఫలమైన ఆమె చిబుక మాధుర్యము గ్రీవశంఖాన ధారై చేరుకొన్నది.

ఆమె చతుర్శంగాభిరామ. ఆమె పరమపశ్చిన గ్రకి. సన్నని బంగారు దుకూలమో ఏమో కటిప్రదేశాన వ్రేలాడే మొలనూలు మెలపులలో కలిసి

పోయి విద్యున్మాల అయినది. మంజీరములున్నూ, చిరుగంటలున్నూ అలంకరించిన ఆమె పాదము తరులతై భూమిమీద వాలబోతున్నట్లున్నది. ఆమె ఎడమపాదపు మునివేళ్ళపైన ఎగరబోయ్యే పక్షిలా నృత్యగతిలో ఆకాశపథ భంగిమతో ఉన్నది. అటాడే తాచుబాము దక్షిణహస్తము, అర్ధచంద్రికా ముద్ర; సవ్యహస్తము లోలముహంసముద్రిక; కంకణాలతో, గాజులతో, భుజభూషణాలతో, చెదరిపోయే వేణీబంధముతో, పొంకాలయి ప్రేమవాహినీయులాలై, కదంబపుష్పాలై, కలలనిధులైన వక్షాలపైన ఉబికే అనేక హారాలతో, నృత్యావేశ దివ్యమనోహరమైన కాలాన ఒకక్షణికంలో, శిల్పి ఒకడు శాంబరీ విద్యచేత శిలగా మార్చినట్లు ఆమె ప్రత్యక్షమైంది!

౨

నాగచంద్రుడు అలాగే నిలుచుండిపోయినాడు. అతని ఊహాపథాలు దాటిపోయిన శిల్పసౌందర్యం. తొందర తొందరగా ఆ విగ్రహంచుట్టూ ఉన్న డొంకలు నరికి పారవేసి, ఆ ప్రదేశం అంతా శుభ్రం చేసి, తుంగభద్రలోనుంచి తన సంచిలో కలశంతో నీళ్ళు తెచ్చి ఒత్తుగా చల్లినాడు. వివిధ పుష్పాలు సేకరించి దండలు గుచ్చి ఆమె మెడలోను వేణీభారంపైన అలంకరించాడు. పూవులతో ఆమె పాదాలు పూజచేసినాడు. తనివితీరని చూపులతో ఆమెను చూస్తూ [illegible] అప్రయత్నంగా అతని ఫాలం చిరు[illegible] పాలలాలిత్యం చూపిస్తూ కఠినమై ఉన్న ఆమె పాదంపైని చేరింది. లోతెరుగని ఉత్కంఠ నాగచంద్రుని వణికించింది.

ఏమిది? అతని శిరస్సుపైన నాతిమీరానఉన్న ఆమె కుడిపాదము నెమ్మదిగా దిగుతూ అతని ఫాలానికి కొంచెం తగిలింది. నాగచంద్రుడు ఉలిక్కిపడి లేచి ఆమె మోముపైన తీక్ష్ణదృష్టులు పరపినాడు. అతని కుడి చేయి ఆమె ఎడమమోకాలిపైన వశింపచప్పన్నందించింది. ఇంతలో ఆ బాలిక

చిరుపులుగు ఎలుగుల నవ్వి ఒడలు కొంచం కదలించింది. బిగిసిపోయే హృదయంతో నాగచంద్రుడు లేచి నిలుచున్నాడు.

చైతన్యోదయ మవుతూ ఉన్న అస్నిగ్ధ నీలోపల శరీరాన నులివెచ్చ రక్తము జల జల పోటెత్తి సమవిషమతలాల క్రొమ్మెరుగులు పులకించి సమస్త నాడుల స్పందించి మెత్తనిదారులై, కొంజివురై నవనీతమైపోయింది. చూస్తూ ఉండగానే ఆశరీరము, ఉదయసంధ్యాకాశములా క్షణక్షణం వన్నెలు మారుస్తూ, కపిశమై, పిశంగమై, శ్వేతమై, పాటలమై పీతమై పుటములో బంగారమై పోయినది. కర్కశమైన ఆ మొగ బరీభాగము నల్లపట్టుకుచ్చుల వేణీ భరమైనది. నగలు బంగారువై తళుకులాడినవి.

" తణికిటతోం " అని ఆ బాలిక నాట్యమాడ ప్రారంభించింది. కాళ్ల చిరుగంటలు చతురశ్రగతి త్రిపుట తాళము వేసినవి. రాను రాను స్ఫుటమైన కంఠంతో—

లలిత లవంగలతా పరిశీలన కోమల. మలయసమీరే
మధుకరనికర కరంబిత కోకిల కూజిత కుంజకుటీరే
విహరతి హరిరిహ సరసవసంతే
నృత్యతి యువతిజనేన సమంసఖి!
విరహిజనస్య దురంతే...

అని పాడుతూ ఆ బాలిక అభినయిస్తున్నది. నాగచంద్రుని ముఖము విరిసిపోయిన దిరిసెనచెట్టులా ప్రఫుల్లమయింది. పొంకాలయి పొలుపుమీరిన ఆమె హస్తాల విన్యాసవేగము అడవి నిమ్మపూవుల పరిమళమయింది. చిరు చెమ్మటలు నఖాగ్రాలతో తుడుచుకుంటూ నాట్యమాడి, మధురమైన ఊర్పులు విడుస్తూ ఆ బాలికవచ్చి నాగచంద్రుని భుజాలపైన చేతులుంచింది. అతని దేహానగగుర్పాటులు మలయసమీరము రివ్వున ప్రసరించినప్పటి చెరువులో నీటి కెరటాలలా పరువులిడినవి. వడివడి ఆమె పెదవులు పరిమళములో అతని

కపోలాలపైన అలమిపోయినవి. దివ్యయౌవనం విరిసిపోతూ పరమసౌందర్యం విరజల్లుతూ ఆ బాలిక చటుక్కున తనను ఆవరించినప్పుడు నాగచంద్రుని చేతులు అప్రయత్నంగా ఆమెను కౌగిలించుకోబోయి మరల వాలినవి.

" ఏమయ్యా! తుంగభద్రాతీరాన కూర్చుందాము రా " అని ఆమె అతని కుడిచేయి పట్టుకొని నదిగట్టుదగ్గరికి అతనికి దారి చూపుతూ అక్కడే వున్న ఓ నల్లరాళ్ళగుట్టమీద అధివసింపజేసింది. అతని పక్కనే ఆమె ఆసీనఅయింది

" నీ హృదయంలో నేనెవర్నా? అన్న ప్రశ్న మొలకెత్తింది! ఈ రాళ్ళన్నీ ఒకరకం చుట్టాలు నాకు. ఈ సంధ్యాశబలరాగంలో అవ్యక్తంగా కనబడే అమాంతంగగిరిపక్క ఒక్క చిన్నశిల నా పూర్వరూపం. ఊంకొ విను !

" ఆనాడు ఎందుకో సార్వభౌముడు విచారవేశుంతో పొదువబడ్డ మలయగిరిశృంగం అయ్యాడు. అప్పాజీ పలుకులు ఆధీశుని హృదయానికి ఉపశమనం కూర్చలేను. పెద్దన్నగారిపద్యాలు వేసంగిలో ఉరుములయ్యాయి. పేరుపొందిన అందకత్తెల్ని వెల వెల పోవచేసే మావాళ్ళు భరతపయోరాశి మథించగా పుట్టిన అప్సరసలు. రాజులో రసజ్ఞతా చంద్రికలను ఉదయింప చెయ్యలేకపోయినాను.

" ఒకనృత్యాంగన. చెంగల్వరాయ సేనానాయకుల వలపుకత్తె, శ్రీకృష్ణరాయసార్వభౌములవారి ఆదరణంపొందది శ్రీవారి ఆగ్రహానికి గురైన తనస్వామికి ఉపకారం చేయచూస్తూ ఉన్నది. ఆమె తనకుమార్తెను పిలిపించి గజ్జెకట్టించింది, ఆబాలిక శిరోత్తమము అందం వంకలు దిద్దగలదు. ఆటలో ఊర్వశికి అపరావతారం. అంతవరకూ, ఆమెకన్నె చెరవీడలేదు ఆబాలికను సార్వభౌమునికి సమర్పించడానికి తల్లి చెంగల్వరాయనితో మంతనం సలిపి అదను చూస్తున్నది ఇంతకన్న వేరేసమయంరాదని ఊహించి ఆనట్టువరాలు తనకుమార్తెను సభలోకి ఉత్సవములతో కొనివచ్చింది.

"ఆ మేళానికి గురువు అమ్మనాచార్యులవారు. చక్రవర్తికి జోహారులు చేసి, 'మహాప్రభూ! దివ్యనృత్యేశ్వరు పాదాలకడ పూజచేస్తూ విద్య నభ్యసించిన ఓ అప్సరోంగన దేవర రాజ్యంలో ఉద్భవించింది. ఆబాలిక భరతంలో పదహారు సంప్రదాయాలూ నేర్చుకొన్నది. ఆమెవిద్య అపర దేవేంద్రులైన సార్వభౌములు దివ్యచిత్తాన అవధరింతురుగాక! రాజ రాజేశ్వరుల హాసాంచలసుషమలా కన్నెపైన ప్రసరించి ఆమెను పవిత్రను చేయునుగాక!' అని నివేదించుకొన్నాడు. మహారాజులుంగారు అంగీకార సూచకంగా తల పంకించారు.

"అర్ధచిటికలో క్రొక్కారు మెరుగుతీగలా ఆబాలిక చక్రవర్తియెదుట నాట్యాన సాగిలపడి, ప్రభువు "లే" అనేవరకూ భూమిపైన వ్రాలిన చంద్రకళలా, పచ్చికలో ప్రసరించే కేతకిపన్నగిలా ఆ సభాచంద్రశిలాతలముపైన అట్లే పడిఉన్నది. మహారాజు కనుసన్న అయినది. ఒక్కుమ్మడిగా తోలుతిత్తి శ్రుతులతో ఒకవిపంచి ఒకకిన్నెర, ఒకసైరంధ్రి పక్క వాద్యాలయినవి. దశావతార కథనముఎత్తుకొని హంగుచేసే గణికలు తాళాలు వాయిస్తున్నారు. మృదంగం పూర్ణలయావతారమైనది. రసము తోలుకాడే ఒక్క విహంగనృత్తగతిలో ఆబాలిక సుడిగాలిలా లేచి:—

'ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదం ధృతవానసి వేదం.
కేశవ, ధృతమీనశరీర, జయ జగదీశ, హరే!
క్షితి రతి విపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణ కిణ చక్రగరిష్ఠే తవ తిష్ఠతి పృష్ఠే
కేశవ, ధృత కచ్ఛపరూప, జయజగదీశ,హరే!...

అని పాడుతూ అభినయించి సభను సమ్మోహనం చేసింది."

# 3

నాగచంద్రుడా బాలికమాటలు వింటూ, సంభ్రమాశ్చర్యాలకు లోనాతూ, తుంగభద్ర నీళ్ళు చీకట్లు తాలుస్తూ ఉండడం కనుగొంటూ, ప్రణయపూజావేశ డౌతూ, ఆబాలిక అందాలమోము పరికించి చూస్తూ, దగ్గరగా అధివసించిన ఆమె యౌవనానందానికే సమ్మోహితు డౌతూ, నిలువునా పులకిస్తున్నాడు.

"ఈ ప్రదేశం నన్ను దివ్యానందంలో పరవశుణ్ణి చేస్తున్నది!"

"సార్వభౌముల కాలంలో ఇక్కడేఒక్క శిల్పమందిరం ఉండేది."

నాగచంద్రు డామెవంక చకితుడై చూస్తూ, "ఈతుంగభద్రానదీ సౌందర్యము ఏలాంటి దివ్యస్మృతులు మొలకలెత్తిస్తున్నది!" అన్నాడు.

"నీహృదయ సౌందర్యమున్ను ఆలాంటిదే."

"సుందరతరమైన నీరూపజ్యోతి నన్ను పాదాక్రాంతుణ్ణి చేసుకుంటూంది!"

"అయితే నాకు హృదయం లేదంటావా, ప్రభూ?".

"ప్రభూ! ప్రభూ!" అనుకుంటూ నాగచంద్రుడు విస్మయం పడ్డాడు.

"నీహృదయం నాఊహ కందరానిది"

"పణ్యస్త్రీకి హృదయం ఉంటుందా స్వామీ?"

"సర్వప్రపంచానికీ సౌరభాలు చూరలిచ్చిన పణ్యస్త్రీల హృదయాలు వంద్యనీయాలు."

"హేళనా ప్రభూ?"

"హేళనా? నీ ఆవిర్భావం ఇంతవరకు నన్ను అచేతనుణ్ణి చేసింది. ఏ అందాన్ని నేను ఊహ చేసుకోలేకుండా ఉన్నానో, ఏ అందం నాకు ఇంతవరకూ ప్రత్యక్షంకాలేదో, ఏఅందం ఉంటుందని భావించి భావించి, దేహం పరవశం కాగా, హృదయం ద్రవించిపోగా, నా ఆత్మ స్వాప్నం

కోసం ఎదురుచూస్తున్నదో, ఆ అందం ఈనాటికి నీలో చూసిన నాకు హేళనా ప్రణయదేవీ?'

ఆ బాలిక అతని ఒడిలోకి వాలిపోయింది

నాగచంద్రుడు ఆవేశంతో, పూజ్యభావంతో ఆమెను బిగియార కవుగిలించుకొన్నాడు ఆముహూర్తము అతిపవిత్రమైనది ఆసంశ్లేషములో వారిప్రేమ మరీ గాఢమై మధురాతి మధురమైనది.

“దేవీ! దేవీ!”—గద్గదమైన అతని గొంతుక అతి ప్రేమపూర్ణమైనది. ఆమె కంఠం నుంచి అదృష్టమైన విచారస్వనము వినిపించి అతని శ్రవణాలకు భూకంప నిస్వనమైంది!

“ఏమీ! ఏమిటిది! కళ్ళనీళ్ళు నింపుకున్నావే! నీబంగారు దేహలత వణుకుతూ ఉన్నదేమిటి? ఈ విచారమెందుకు? పవిత్రమూర్తీ!”

“నీపూజ నన్ను మూలానికి కదులుస్తున్నది. రూపం అమ్ముకొని బ్రతికే మేము ప్రేమమాధుర్యాను రుచియైనా ఎరగము. నన్ను పూజాపీఠ మెక్కించి పరవశురాల్ని చేస్తున్నావు!”

“విద్యు హేలో వ్యక్తమౌతూవున్న ఇంతనాటినుంచీ ఒక అద్భుత మూర్తినీ, ఆమూర్తిని ఆవరించుండే ఓ విచిత్ర హృదయాన్నీ, ఆసర్వాన్నీ ఆవరించి పూరించుకొని ఉన్న పవిత్రాత్మను ఉత్కృష్టాశయం చేసుకొని నేను ఆదేవికోసం లోకాలు గాలిస్తూ, నాహృదయం దేవాలయం చేసుకొని పూజాద్రవ్యాలతో అంతులేనియాత్ర చేస్తున్నాను”

“ఆ ఆశయం మృగతృష్ణామాత్రమేకదా ప్రభూ!”

“నిజమనుకొనే ఈ ప్రపంచానికన్న మృగతృష్ణ ఎక్కువ నిజం కాదా దేవీ!” అంటూ నాగచంద్రుడా విచిత్రబాలికను మరీగాఢంగా కవుగిలించుకొన్నాడు. ఆ అమృతమూర్తిని అలముకొన్న పరిమళాలతో వివశుడయ్యాడు.

"చక్రవర్తి పరమేశ్వర హృదజనిత నాట్యమన్నీ, నందికేశ్వరసముపదిష్ట నాట్యమన్నీ, భరతమహర్షి ప్రచారిత నాట్యమన్నీ, ఏవిద్య ఉన్నదో, ఆ మహా కళ నాడు ఆ బాలికలో మూర్తీభవించి, వికసించడం కనుగొన్నాను."

నాగచంద్రుడు విప్పారిన నయనాలతో ఆమెను తిలకిస్తూ, "దేవీ! ఆ బాలికవు నువ్వే కావుగదా" అని అడిగినాడు.

"ప్రభూ! నేను కానని చెప్పనా, అవుననని చెప్పనా?"

ఈషదవనతమైన ఆమె మోమును నాగచంద్రుడు చుబుకము పట్టి లేవనెత్తుతూ "దేవీ, నీ పెదవుల్లో మందహాసలేశమన్నా వర్తించకుండా నన్ని విచిత్ర స్వప్నంలో తేలుస్తున్నావా?" అన్నాడు.

"ప్రభూ! నా సర్వస్వము నీకు పూర్ణార్పణం చేస్తున్నా, ఈ దివ్యక్షణాలు, స్వప్నమో నిజమో నాకే తెలియకుండా ఉన్నవి."

"ఈ దివ్యస్వప్నమే ఎప్పుడూ నిలిచి ఉండరాదా!"

"అవును ప్రభూ!"

అని నిశ్వసిస్తూ, ఆ బాలిక — "త్రిసంధ్యము సార్వభౌమునికి ఆనందం నివేదించింది. అర్ధరాత్రి —" అన్నది.

"అర్ధరాత్రి?"

"సార్వభౌముని అంతఃపురానికి ఆ బాలికను పంపడమయింది" నాగచంద్రుడు కూలిపోయినాడు. అతని చేతులు వాడిపోయిన తామర తూళ్ళయి వాలిపోయినవి. అతడు నిట్టూర్పు విడుస్తూ ఆ నల్లరాతిమీద తల వాల్చాడు. "ఇక వినలేను దేవీ!"

"ప్రభూ, నేను పణ్యస్త్రీని."

"నిన్నా రాత్రి పంపినపాతకులు భ్రష్టులు, పిశాచాలు!"

"ప్రభూ! అతిహీనకులంలో జన్మించిన మా పాపహృదయాలు పవిత్రం కాగలవా? సార్వభౌముని క్రీగంటిచూపు మమ్మల్ని అప్సరసల్ని చేయదా!"

"మీరు దివ్యజన్మలే దేవీ! మిమ్మల్ని అనుభవించే ఆనీచాతినీచులు_"

"ప్రభూ. విను_ సర్వాలంకారాలతో వాసకసజ్జికనై, మహారాణినైనట్లు ఉప్పొంగిపోతూ, చక్రవర్తిరాకకై ఎదురు చూస్తుంటిని. ముహూర్తాలు గడచినవి. కోటలో ఘంటారావాలు మోగుతున్నవి. అర్ధరాత్రి తూర్యారావాలు తృతీయయామపు ఢంకానినాదము వినబడుతూనే ఉన్నవి. అంతఃపురాలన్నీ నిశ్శబ్దంలో జోగి ఉన్నవి. ఆ చిన్నమాంబాగారి సికుడు రాలేదు. నాహృదయంలో దవానలం చిగురించింది. లజ్జాశో కుంగిపోయాను. ఆ మహాపురాభవంలో వైతాళికుల హెచ్చరికలు, వందిమాగధులపాటలు నాహృదయ కుహరంలో బ్రహ్మాండము పగిలినట్లు ప్రతిధ్వనించి, ఒళ్ళు తెలియని మూర్ఛలో మునిగిపోయినాను.

నాగచంద్రుడు చివుక్కునలేచి కూర్చున్నాడు

"సార్వభౌముని సౌజన్యము నేనొక్కక్షణమాత్రం సందేహించాను నువ్వంతఃపురంలోకి వెళ్ళినసంగతి మహారాజుకు తెలుసునా?"

"ఈపణ్యస్త్రీకి అంత విచారణ. చేసేయోగ్యత కలదా ప్రభూ! చిన్నమాంబాదేవి సరససల్లాపానందుడైన చక్రవర్తికి ఆదేవిపైన యేదోకారణంచేత కొంచెం కోపంవచ్చిందనీ, ఆనాటి నా నాట్యం ఆయన హృదయంలో సందేహాన్ని వెన్నెలై చీకట్లు పారదోలిందనీ, సభనుంచే, అపట్టునే మహాప్రభువు చిన్నమాంబాదేవి అంతఃపురానికి పోయి క్షమాపణ వేడి ఆమెను అనునయించినాడనీ తరువాత నేను విన్నాను."

"చెంగల్వరాయని దుశ్చేష్టితమమా దేవీ ఇది!"

"అయిదురోజులవెనక, తీవ్రజ్వరంలో ఉన్న నాకు స్ఫుటాస్ఫుటంగా

మెలకువవచ్చింది. నృత్యంనాటి ఆసభలో రాజశిల్పి శిష్యులతో వచ్చినాడట. ఒకశిష్యుడు_ ఆపందరసైక జీవి. దివ్యసౌందర్యానందుడు — ఈపాపినీ ఈమెనాట్యాన్ని చూచి వెర్రిప్రేమలో మునిగిపోయినాడట —"

"మునిగిపోవటం అబ్బురమా దేవీ?"

"ఆబాలిక ఆజ్వరంతో కృశించి కృశించి - నువులను నాలోకలయించుకు"

ఆమాట ముగించకుండానే నాగచంద్రుడు ఆశిలాబాలను, చెమర్చే కన్నులతో దరికి చేరదీసుకొని ఆమోము తనహృదయాని కద్దుకొని ఆమెతల కన్నీటితో తడిపినాడు.

తూర్పున కొండలపక్కనే ఎర్రనై నాగచంద్రుని సంతోషరాగములా చంద్రబింబము ఉదయించింది. తుంగభద్రనీళ్ళు శిలాబాల హృదయములా కెంపుజీరలు సాగినవి. స్వాప పంచము జ్యోత్స్నానందంలో వివశత్వమొందింది.

ఆశిలావేదికపైన నాగచంద్రుడు మెత్తనితల్పము అమరించి ఆబాలికను అధివసింపచేసినాడు. ఆమె మోముచు తనివితీరగా పారకిస్తాడు. ఆమె సౌందర్యరేఖలచేతులు హృదయాని కద్దుకొని దూరాన్నుండి దగ్గరనుండి గమనిస్తాడు. ఆమె లావణ్యము పుకిసిళ్ళకన్నుల కద్దుసుంటాడు. ఆమె ఇంకనూ శిలాబాల కాదుగదా అన్న అనుమానము వీడని చూపులతో, స్పర్శతో కదుష్ణతను, కాంతులను పరిశీలిస్తాడు.

ఆమె చిరునవ్వుతో, సిగ్గుతో కొంచెము వంచిన మోముతో, నీలాలజాలరులైన కనురెప్పల మాటునుండిన అతని ఆనందము తనహృదయాన్ని నింపుకుంటూన్నది.

నాగచంద్రుడు ఆమెయెదుట మోకరించి, "నువ్వు నాస్వప్నబాలవు. నాజీవితాధిష్ఠాన దేవతవు. నేను తుంగభద్రను, నీవు కృష్ణవు" అని ఆమె ఒడిలో వాలినాడు.



ఆతడా ఆనందాశ్చర్యత్వంలో, తమి నిండిన హృదయముతో, అగణా విర్భావమును గుర్తింపలేదు మాల్యవత్పర్వత సానువులపైన ఒక రెప్పపాటు తనరథము ఆపి కర్మసాక్షియైన సూర్యభగవానుడు ఆనూత్న దంపతులపైన తన అరుణకిరణ కుంకుమాక్షింతలు, చల్లినాడు సుఖపారవశ్యముద్రితాలయిన కనుదమ్ములతో, చెదరిన ముంగురులతో, సడలిన వేణీభరంతో, తన హృదయ తలముపైన కలువపూదండలా వాలియున్న శైలబాలలోని తీయని వన్నెను నాగచంద్రుడు అరమోడ్పుకనులతో ఆస్వాదిస్తున్నాడు. అలసాలసాలయిన వేలోక తెమ్మెరలు తుంగభద్రాతరంగ శీకర శైత్యాలతో ఆయితమైవచ్చి శైలబాల ముంగురులను పాపటను చక్కనొత్తుతూ కనుపిమ్మ రేకులను ఇంచుమించు విప్పసాగినవి. నాగచంద్రుని కంఠాన పెనవేసికొన్న బాహులతో ఇంచుక సడలించి, చటుక్కున కళ్ళు తెరచి తల ఇంచుక ఎత్తి ఆమె అతని మోము తిలకించినది. ఆమె చూపులలో నునుసిగ్గులు చిరుకెరటాలై ఆనందకాంతుల మిల మిలలాడి, అంతలో ఆమె రెప్పలమాటున అదృశ్యములైనవి. అర్ధపూరితాలైన చిరునవ్వులు ప్రసరిస్తూ అతడామెను గట్టిగా హృదయానికదుముకున్నాడు

రూపవిలాస ముగ్ధలైన శిల్పుల ఆనందము రూపలయాన్ని కోరుతుందా? ఉత్కృష్టరూపాన్ని సృష్టించే ఆశయమాత్రం శిల్పుల తపస్సు కాదా? అల్పదోషమైనా ఎరుగని రూపోత్కృష్టాన్వేషణకు ఫలము ప్రాకృతజనులు కోరే దేహానందము మాత్రమేనా? రూపురేఖలు సాధించుకొనే వికాసము నులివెచ్చని దేహంచే బంధితమైనదా! ఏమిటీ విచిత్ర సంఘటనం!

"ప్రభూ! మీ శంకిత హృదయాన్ని ఆవరించిన తెరను తీయలేను, కాని, సంశయా లెరుగని ఆతరుణి శిల్పసభలో నన్ను చూచిన మరుక్షణా

న్నుండి ఉన్మత్తుడై పోయినాడట! ”

“నువ్వు మూర్తీభవించిన సౌందర్య సర్వస్వానివి! ”

“ అపకృతి లేనిదివ్యసౌందర్యము స్వప్నమాత్రము ప్రభూ!”

“మనోరథప్రాయమైన రూపానికి రేఖలులేవు. మూర్తి లేదు. మూర్తించుకోగలిగిన ఉత్కృష్టరూపమే శిల్పికి ఆశయం. తీర్థాలు తిరిగిన ఈనాను ఈనాడు ప్రత్యక్షమైనావు. ”

“ ఆనాడు కాదా ప్రభూ!” అంటూ కంఠాన భుజలతలు పెనవేసి కన్నులలోకి చూపుల చొనిపి హృదయాన్ని మేలుకొలుపుతున్న శైలబాలను కంపించిపోతున్న కరములతో ఎడంగా చాచిపట్టి దేహమనఃప్రాణాల్ని చూపులలోకి తెచ్చుకొని, ఒక్కనిమేషం ఒరసిచూస్తూ, సుఖస్వప్నంనుంచి లేవలేక నిద్రలేస్తున్న వానిలా “దేవీ! ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు!?” అంటూ ఆనందమూర్ఛితుడైనాడు నాగచంద్రుడు.

తుంగభద్రా తరంగాలవంటి కరతలాలతో ప్రియుడిమేను నిమురుతూన్న శైలబాలను—ఒక్కనిట్టూర్పుపుచ్చి, “దేవీ, స్వప్నం కాదుకదా?” అంటూ హృదయానికి అదుముకుని “దేవీ! మధురతరమైన మన కథను నన్నింక చెప్పనీ” అని నాగచంద్రుడన్నాడు.

“నిన్ను చూచిననాటనుంచీ నీస్వరూపాన్ని పసివాలు నింపుకొన్న నీలగ్రావంలో మూర్తింప నారంభించాను.

“ ధన్యను. ”

“ నీబాల్యంలో ఎప్పుడూనన్నూ మీయింటికి వచ్చేవాడను. జీవవర్ణాలు వెలిగే వివిధపుష్పాలు సేకరించి, రసహృదయా లయిన ఫలముల కానుకలతో దిన దినమూ మీ మేడకు వస్తూ, నీకవి అర్పించుకొన్నాను. ”

ఫలములే కాదు. నీ ప్రణయమే ఔషధానికి అనుపానం చేశావు-”

"దేవీ, నేను సంకల్పించిన శిల్పమూర్తికి నా ప్రేమరసంతో మెరుగులు దిద్దుకొన్నాను. ఎంతరసభావన ధారపోసినా, మూలానికి నా నిర్మించినప్రతిమ బింబమాత్రమే అయిపోయిందని సిగ్గుపడ్డాను. నీనయనాంచలాల మెరుపులూ, నీ మందహాసాల శీతద్యుతులూ, ఆనాటి నీనాట్యభంగిమలో సౌకుమార్యమూ, హృదయాన పదిలించుకొని తెచ్చినాటంకంపు మొనతో ముంచి, నాశిలాబాలకు అందిచ్చుకున్నాను. నాపూజాకల్పనం నీయెదుట నిలవడానికి నాకు ధైర్యం చాలిందికాదు."

"శిల్పిశేఖరా! నాపత్ని యేది,? అని నేను దినదినం ప్రశ్నించేదాన్ని ప్రభూ!"

"తేరుకొంటున్న నీ ఆరోగ్యానికి భంగం కలిగించలేక —"

"దినములు గడుపుతూండే నేనొక నాడు పట్టుపట్టినాను నాస్తానని కాదుపి యా?"

"దేవీ! ఆ దారుణకథ మళ్ళా ఎందుకు స్మరిస్తావు?"

"ప్రభూ! విను. నేను ఎవరువారించినా వినక, ఒకనాడు పల్లకీలో బయలుదేరాను నువ్వు నరికివేసిన పెద్దరాచే నీ శిల్పమందిరగల కూలగా బయలుదేరింది. ఆశిల్ప మందిరానికి ఆపరాని ఉద్వేగంతో, నిలువలేని ఉత్కంఠతో పల్లకీ దిగివచ్చి నా ప్రతిబింబాన్ని చూచాను. నారూపంలో నాతో ఉండేలోపాల్ని సవరించుకొని దివ్యత్వం తాల్చిన సౌందర్యం ముందు లజ్జించి, నిశ్చేష్టనై చాపకట్టులాపడిపోయాను."

"దేవీ! నాశిల్పబాలకు నేను పోయలేని ప్రాణాన్ని నీ వప్పుడర్పించి నన్ను ధన్యుణ్ణి, అధన్యుణ్ణికూడా చేశావు,"

"ప్రభూ! ఆ విగ్రహాన్ని చూచి నేనునీప్రేమగంభీరతనూ విశ్వాసా

పానీన్ని తెలుసుకొన్నాను. నా తుచ్ఛదేహాన్ని వదిలేసి, నా దివ్యరూపంలో చేసుకొని తర తరాలనుంచీ నీకోసం ఈ మందిర శిథిలాల్లో ఈ నదీతీరాన తపస్సు చేశాను. ”

౬

పవిత్రాలైన ఆ మూడు రాత్రిళ్ళు ప్రశస్తలై జరిగినవి. దీర్ఘాలు. అర్ధనిమీలిత చకోరాలు. వెలుగు లీనుసుంగ నయనాలైన ఆమె నెమరకన్నులు తనివి తీరని చూపులపూవుల పూజతో తన్ను నింపివేస్తున్నప్పుడు, సరసమై స్పష్టమై; సుస్నిగ్ధమై, దివ్యరేఖలు కలదై, నులువెచ్చనై, ఉదయారుణ కాంతిలా మెరిసిపోతున్న ఆమె శరీరసౌందర్యము తన్ను సుడిగుండంలా, చంద్రకిరణంలా వికసించిన మల్లికావనంలో సువాసనలుగా ముట్టడివేస్తున్నప్పుడు, ఆమె తనలో లీనమై పోతున్నప్పుడు, కోటిపాటల కుసుమాలలో మధువుల వాకలు ఆమె పెదవులు తన పెదవుల గాఢమైన తమిలో చుంబించేటప్పుడు. నాగచందుని దివ్యానంద తన్మయత్వము, కోటి ఉద్యానాల సౌరభాలొక్క బిందువులో సమాహృతాలయినట్లయినది.

అవి నాల్గవనాటిరాత్రి సంపూర్ణ పూర్ణిమాజ్యోత్స్న తుంగభద్రా తోయాలపై పన్నీటి పరిమళాల సంపులు చల్లుతున్నది.

ఆ పరిత్యక్త యువయుగ్మానందంలో లయమై లోకమంతా నిశ్శబ్దమైంది.

వారిద్దరూ యుగాలనాడు ఏ మహాతారలలో ఉద్భవించి యాత్ర చేస్తూ భూమి కవతరించిన కిరణద్వయమో!

" ఓకళాధిష్ఠానదేవా, సుధాకరసార్వభౌమా! పూర్ణతతో తూగే సౌందర్యబాలకై కల్పాలలో తపస్సు చేసుకొన్నాను ఆమెను సంకల్పించు. కున్నాను పరిపూర్ణతను చేరే సౌందర్యమూర్తిగా సృష్టించుకొన్నాను. రూపరేఖా కాంతిసౌందర్య సంపూర్ణత్వాన కలిగే అద్భుతానందం ఒక క్షణికము మాత్రము ఈ సౌందర్యం, ఈ ఆనందం, ఈదివ్యనిమేషమూ అనంతం చెయ్యవోయి ప్రభూ! " అని మహాయోగవంతమైన అభ్యర్థనము చేశాడు నాగచంద్రుడు!

ఒక చిరుమబ్బు చంద్రబింబాన్ని ఒకలిప్తమాత్రం కప్పినది. లోకము ఒకలిప్తమాత్రము గాఢాంధకారమయమైనది.

ఇంతలో దిక్కులు స్పష్టాలై మళ్ళీ చంద్రకాంతులతో తళతళలాడినవి శిల్పబాల యథాప్రకారం శిలావిగ్రహమై అనంతనాట్య మొనరిస్తు న్నది నాగచంద్రుడు మోకరించి ధ్యానంగ భంగిమలో ప్రణామశిల్పి స్వరూపాన ఆమె ఎదట కాలశిలా విగ్రహమూర్తిలో ఘనీభూతుడైనాడు-

తుంగనది ప్రవహిస్తుంది.



# నాగలి

(చిన్నతనాన్నుంచీ నాతో అద్భుతమైన కలలుకన్న
శ్రీ ముష్టి లక్ష్మీనారాయణకు ఈకథ ప్రేమతో అంకితము)

## ౧

హృదయంలోని కల్మషాన్ని ఈవలావలకితోసివేసి, దాగిఉన్న సౌందర్యాన్ని బయటపెట్టే మంచిపాటలా నాగలిసాగిపోతూంది. సారింపబడిన తిస్వరాలు హాయిమంటూ పలుకుతూఉన్న వీణతీగెలులా ఆపొలంలో నాగేటిచాళ్ళు ప్రత్యక్షమవుతూ ఉన్నవి. తెరచాపల్లా, ఆకాశంలో చొచ్చుకుపొయ్యే పక్షిరెక్కల్లా, తెల్లటి ఆదుక్కిటెద్దులు రెండూ ముందుకు నడుస్తూన్నవి. శిష్యుని మనస్సు వ్యవసాయంచేసే పూజ్యులైన గురువుల్లా, రైతు నాగలి వెనకాలే కొరడాతో ఎద్దులను అదిలిస్తూ తోలుతూ ఉన్నాడు గట్టుమీద కూర్చొని తన చిత్రలేఖన పుస్తకంలో ఆపొలం పొలం వెనకాల కొండలు, కొండలపైన మేఘాలు ఆకాశాన్ని, ఆ మబ్బుల్ని. ఆ కొండల్ని. అంచుల్ని. ఎరుపు రంగులు చిత్రిస్తూన్న అరుణ కిరణాల్ని. చెట్లని, పక్షుల్ని శ్యామలరావు కుంచెతో బొమ్మ వేస్తున్నాడు. శ్యామలరావు లోగొంతుకలో ఒకపాట పాడుకుంటున్నాడు.

“ తెల్లి మేఘాల నృత్యదర్శన మాత్రయేటి
నవ్వులే తెల్లన్ని పువ్వులే దేవి.

తళ తళా కన్నులా మెలయించు కాంతులే

నాగేటిచాలులో నవ్యాంకురము దేవి!”

అలుముకుంటూ ఉన్న చీకట్లో ఎద్దులను విప్పుతూ ఉన్న రైతును చూసి శ్యామలరావు మళ్ళీ మళ్ళీ ఆచరణాన్నే పాడుకుంటూ తన రంగులు పెట్టె, చిత్రలేఖన పుస్తకమూ సర్దుకుని తన స్నేహితుని ఇల్లు చేరుకున్నాడు. అయిదుఅడుగుల ఎనిమిదిఅంగుళాల మనిషి, కొంచెం వంగి గుమ్మందాటి ఆపర్ణశాలలోని ముందర హాలులోకి అడుగుపెట్టేటప్పటికి “హల్లో శ్యామ్! చీకటయ్యేదాకా చిత్రిస్తూ ఉన్నావే! అంత సౌందర్యవంతమైన వస్తువు యేం కనపడిందయ్యా?” అంటూ వదులు జడను వేసుకుంటూ ఉన్న స్వర్ణ కుమారీదేవి తడికచాటున ఉన్న గదిలోంచి చక్కా వచ్చింది. శ్యామలరావు స్వర్ణకుమారిని చూసి పెదవుల్ని ప్రసరించే చిరునవ్వు హారికేన్ దీపపువెలుగులో కలిసిపోతూండగా, ప్రేమకాంతులు కళ్ళల్లో తొణికిసలాడుతూండగా

“ అనేకవేల సంవత్సరాలనుంచి ఉన్న పురాతన విషయమే చిత్రిస్తూ ఉన్నాను. మీ పొలం దున్నడమే! ”

“వ్యనసాయం మనస్సుని పాతేస్తుంది మెదడుని కఱ్ఱబారుస్తుంది- అంటావే! వ్యవసాయపు దృశ్యాలు, చిత్రలేఖనపు విషయాలు యెట్లా అవుతాయయ్యా? వ్యవసాయంలో రసస్వరూపం ఉందామరి?”

“ వస్తువులో మొరకుతనం ఉండవచ్చుగాక! వస్తువు తుచ్ఛమైంది కావచ్చుగాక' ఆ వస్తువు కళావస్తువు కాగూడదనే ధర్మంఎక్కడ?”

“సుభావప్రసన్నమైన వస్తువే కళావస్తువుఅవుతుందని వాదిస్తావుగా!”

“ఒకనీచవస్తువు ప్రత్యేకార్థమును ఉత్తమమైన భావంతో ఈయ

లేక పోవచ్చునుగాని, ఆవస్తువు ఇతరవిషయముల సంబంధం చేత ఉత్తమ భావపూరితము కావచ్చుకాదా సొన్న సానీ! ”

“నన్ను సొన్న సానీ, గిన్న సానీ అని పిలవకు! నాకు ఒళ్ళుమండిపోయే కోపం వస్తుంది. పూర్ణమైన పేరు పెట్టి పిలవరాదూ?”

“ ఏదో కోపం మనస్సులో ఉంచుకొని, గానమాధుర్యమైన పేరుతో పిలిస్తే కోపం ఎందుకు స్వర్ణనామ్నా!”

“ ఛీ! నీతో మాట్లాడడం బుద్ధితక్కువ. నీకు మా వ్యవసాయం ఇష్టంలేకపోతే, నాకెందుకుకోపం. అదుగో మా అన్నయ్య వస్తున్నాడు. ”

ఇంతట్లో స్వర్ణకుమారి అన్నగారు శ్రీనివాసరావు గుమ్మందగ్గర తలవంచి లోపలికి వచ్చినాడు.

“ ఏమిటి పిల్లకాయలిద్దరూ దెబ్బలాడుకుంటున్నారు? బుద్ధితక్కువ! కోపం అంటున్నా వేమిటి, చెల్లీ?”

“ ఈ మిత్రుడుగారి మాటలు నీకు పథ్యం. నేను బుద్ధితక్కువదాన్నని అందరికీ తెలియునే తెలుసు. అదే అంటున్నాను!”

అని స్వర్ణకుమారి విసవిస లోపలికి వెళ్ళిపోయింది.

“ఆడవాళ్ళకి కోపంకూడా అందమేనోయ్, ”

అన్నాడు శ్రీనివాసరావు, నవ్వుతూను.

“ఏమన్నా నాస్తోన్, శ్యామం అనేమాట! కుక్కరులో భోజనంఅంతా ఉడికిందో లేదో చూశావా, లేదా? బొమ్మలతో కడుపునిండిన శ్యామానికి అన్నంకావాలో అక్కరలేదోకాని వ్యవసాయదారుణ్ణయిన నాకు వృకోదరత్వం అలవడింది. మొక్కపాతే కాలంలో స్నానంచేసి వస్తున్నాను ” అని శ్రీనివాసరావు స్నానాల గదిలోకి వెళ్ళిపోయాడు.

"ఇదో కొత్తకవిత్వరకపు వ్యవసాయదారుల భాషలా ఉంది" అంటూ శ్యామలరావు కాళ్ళుచేతులు కడుక్కొనేందుకు దొడ్లోకి వెళ్ళాడు.

౨

కుంతలూరు గ్రామానికి పదిమైళ్ళదూరంలో రెండు కొండలమధ్య ప్రవహించే ఒక వాగుకి పెద్ద ఆనకట్ట కట్టి బ్రహ్మాండమైన చెరువు నిర్మించారు ప్రభుత్వంవారు. ఆ చెరువుక్రింద ఒక వెయ్యి ఎకరాలభూమి మాగాణి మొదలైన సాగుకావడానికి వీళ్ళున్నవి. ఆ భూమిఅంతా అడివిలా ఉండే రోజుల్లో ఇంగ్లీషు విద్యాపండితులైన యువకులనేకులు నిరుద్యోగపు సైతానుపాలనుపడి ఉండేవాళ్ళకు ఆభూమంతా పంచి యివ్వవలెనని అలజడి పుట్టింది. ప్రభుత్వంవారు మొట్టమొదట నూరు ఎకరాలు పదిమంది పట్టభద్రులకు పంచి యిచ్చేటట్టున్నూ, వ్యవసాయం పెట్టుబడిగాను ఒక్కొక్కరికి అయిదేసి వందల రూపాయిలు అప్పుఇచ్చేటట్లును భూమి హక్కు పదిఏళ్ళవరకు ప్రభుత్వం వారికే ఉండేటట్లును, చివర అయిదుసంవత్సరాలు నాటికి పదిరూపాయిలవంతున పన్ను యిచ్చేటట్లును, అడ్వాన్సు సొమ్ము యావత్తూ పదియేళ్ళల్లో తీర్చుకొనేటట్లున్ను మొదలైన షరతులతో భూమి యిచ్చునట్లు ఏర్పాటుచేశారు. దేహదారుఢ్యము, మనోగాంభీర్యము కూర్చుకొన్న పదిమందిని వేలకొలదివచ్చిన అభ్యర్థులలో ఏరుకున్నారు. అందులో శ్రీనివాసరావు ఒకడు. శ్రీనివాసరావూ, శ్యామలరావూ కాశీ విశ్వవిద్యాలయంలో సహాధ్యాయులు—M Sc. పట్టాలు పొందిన తరువాత వారిద్దరూ విడిపోయినారు. తనలో ఉండే లలితకళాచతురత్వాన్ని పైకి మొలిపించి విజృంభింపజేయడానికి ప్రసిద్ధికెక్కిన శాంతినికేతన లలితకళాశాలకు శ్రీ నందలాలు మహాశిల్పి పాదాలు పూజింప పోయినాడు శ్యామలరావు. నాలుగేళ్ళు అయినతర్వాత చిత్రకళాకోవిదుడై అనేక

పరిదర్శనాలలో బహుమతిలంది అతడు ఆంధ్రదేశోన్ముఖుడైనాడు. చిన్నతనాన్నించి సహాధ్యాయుడైన శ్రీనివాసరావు చెల్లెలు స్వర్ణకుమారిని తన హృదయ సింహాసనంలో అధివసింపజేసుకున్నాడు, స్నేహితుడు ఇద్దరికన్నా అయిదేండ్లు చిన్నదైన ఆ బాలిక వీరిద్దరూ M Sc. కాశీలో చదివే రోజుల్లో వారితోపాటే మకాం చేసి Inter చదువుతూ ఉండేది.

"స్వర్ణకుమారి ఏడాదికిందటనే B. A. పూర్తిచేసుకుని అన్నగారి వ్యవసాయంలో సాయం చేయడానికి తల్లిదండ్రుల అనుమతిమీద కుంతలూరు గ్రామంలో ఉన్న నూతన వ్యవసాయాశ్రమానికి చేరుకుంది. అప్పుడామెకు పందొమ్మిదేళ్ళు. నవయౌవని. దివ్యసుందరి. అలాంటి స్వర్ణకుమారిని మంచిముహూర్తంలో వివాహం చేసుకుని తన లలితకళకు వన్నెలు దిద్ది తనజీవితం దివ్యానందపూరితం చేసుకుందామని శ్యామలరావు ఉవ్విళ్ళూరుతూండటంచేత ఇంటికి వెళ్ళగానే తల్లిగారి హృదయం కల్లబడేటట్లు వారం రోజులయినా ఉండకుండానే శ్యామలరావు కుంతలూరు ప్రయాణమయ్యాడు. శ్యామలరావుఅంటే స్వర్ణకుమారికి చిన్నతనంలోనే అయిదేళ్ళ బాలికగా ఉన్నప్పటినుంచీ ప్రేమే. తియ్యని మంజులమైన అతని గొంతుక విన్నా; గురుశిక్షణ లేకపోయినా అందాలు నేర్చుకోబోయే అతని చిత్రలేఖనాలు చూసినా ఆమెగుండె మధురంగా కొట్టుకునేది. చదువుకునే రోజుల్లోను, శెలవురోజుల్లోను తన ఊళ్ళో ఉన్న ప్రసిద్ధికెక్కిన ఒక గాయకునిచేత ఆమె వీణపాట చెప్పించుకొన్నది శ్యామలుని కళకు తనవీణ దివ్యార్పణగా సంకల్పించుకున్నదా బాలిక.

శ్రీనివాసరావుకి చిన్నతనాన్నుంచి వ్యవసాయంఅంటే మహాఇష్టం పాతబడి నష్టదాయకమైన వ్యవసాయపురీతులన్నీ నెమ్మది నెమ్మదిగా మార్చి

శాస్త్రపరిశోధనా పూర్వకమైనమంచిపంటలు పండించే కొత్తమార్గాలు అవలంబించాలని అతనివాదన. కొద్ది రైతాంగమైన తండ్రిగారి కర్షకత్వానికి అనేకమార్పులు తీసుకువచ్చి, వీలైనప్పుడల్లా శ్రీనివాసరావు చక్కని వ్యవసాయపు పద్ధతులు ప్రవేశ పెట్టించాడు. ఉద్యోగం లేకుండా వీధులవెంబడి తిరుగుతూ, లోకాన్ని తిట్టుకుంటూ జమీందారుల్నీ ధనాఢ్యుల్నీ పేరు తల్చుకుని పళ్ళుకొరుకుతూండే చదువుకున్నవాళ్ళంతా తిరిగి వ్యవసాయంలోకి చేరిననాడే భరతదేశం బాగుపడుతుందని ఛాతీ విస్ఫారితంచేసి కళ్ళల్లో కాంతులు ప్రసరిస్తుండగా శ్రీనివాసరావు వాదిస్తూంటాడు.

ఈ విషయంలోనే శ్రీనివాసరావుకీ, శ్యామలరావుకీ భేదాభిప్రాయాలు కలిగాయి. నేల దున్నుకోడానికి మెదడు దున్నుకోడానికి ఉత్తరపు ధృవానికి, దక్షిణపు ధృవానికి ఉండే తేడా ఉందని అంటాడు శ్యామలరావు. ఒకదానికొకటిసంబంధంఉంటే ఒకదాని సహాయంవల్ల యింకొకటి విజృంభిస్తుందని శ్రీనివాసరావు వాదిస్తాడు. అన్నగారి వాదన దిట్టంగా బలపరుస్తుంది స్వర్ణకుమారి. ఏ 'యల్. టి.' పట్టానో చేతిలో పుచ్చుకుని "మేష్టరీపని మేష్టరీపని" అని దేశాలు తిరగడంకన్నా, భారత నారీమణి ఎంతచదువుకున్నా భర్తలకు సహాయంగా వ్యవసాయవృత్తే అవలంబించాలని తన తియ్యటి గొంతుకతో చక్కగా వాదిస్తుంది.

ఆ కారణంచేతనే పట్టభద్రురాలు కాగానే, నాగలి పట్టుకున్న అన్నగారికి అన్నం పట్టుకెళ్ళే ఆడబడుచు అయింది. అన్నగారికి పది ఎకరాల భూమిలోను ఒక ఎకరం తన స్వంతసేద్యానికి ఉంచుకుంది. రాత్రింబగళ్ళు కష్టపడి ఆ ఎకరంభూమి, పూలచెట్లతోను, కూరగాయల మొక్కల పాదులతోను, పండ్ల అంటులతోను, తిరిగి అమ్మేందుకు మొక్కలున్న కుండీలతోను నింపివేసింది.

# 3

తనకూ, స్వర్ణకుమారికీ జరిగిన వాదనను గూర్చి ఆలోచించుకుంటూ భోజనం దగ్గిరికి వచ్చి కూర్చున్నాడు శ్యామలరావు. వచ్చిన వారం రోజుల నుంచి ఎప్పుడూ పాటలు పాడుతూ తాను నవ్వుతూ, యితరులను నవ్విస్తూండే శ్యామలరావు చప్పుగా చల్లగా భోజనం దగ్గిర కూర్చుని తన వేపైనా చూడకుండా తలవాల్చుకొని ఉండడం స్వర్ణకుమారి చూసింది. ఆమె హృదయం ద్రవించిపోయింది. ఒత్తయిన జుట్టుతో వికసించి ఉన్న అందమైన అతని తలను తన హృదయానికి అదుముకుని "నిన్నూ నా కన్నా ఏమీ కోపంకలగదు, శ్యామం. నీ భావాలకి తీరని విచారమే కాని" అని అందామని ఆమెకు గాఢమైన కాంక్ష కలిగింది.

"నామాటలకు కోపం వచ్చిందా ఏమిటి, భోజనం తిన్నగా చెయ్యడం లేదు, శ్యామ్" అని స్వర్ణ అన్నది.

"నీ మాటలకు కోపం ఎందుకు, స్వర్ణా? గంగా కూలంలోని వెన్నెల లాంటి నీ హృదయం తెల్చుకుంటూ యిక్కడికి వచ్చాను ఆ వెన్నెలలో ఎప్పుడు తెలిపోదామా అని ఆలోచిస్తున్నానంతే."

స్వర్ణకుమారి కళ్ళల్లో మెరుములు మెరసినవి శ్రీనివాసరావు, శ్యామలరావుని చూసి,

"ఒరే! శ్యామ్ నేను ఇంజనీరుతో మాట్లాడి ఏర్పాటు చేసి ఉంచాను. నువ్వు దరఖాస్తు పెట్టగానే నీ పది ఎకరాలు నీకు యిస్తారు. నువ్వు వ్యవసాయం పారంభించగానే సజమైన భాగస్వామిని అవుతూ నీగృహిణి

నీయింటికి అవతరిస్తుందని ఓతాయిలంగారు నన్ను నీతో చెప్పమన్నారు ” అని అన్నాడు.

శ్యామలరావు మాట్లాడలేదు. అన్నగారి మాటలకు చిరునవ్వు నవ్వుకుంటూ ఉన్న స్వర్ణకుమారి శ్యామలుని వదనానికి నివ్వెరపోయి చూచింది.

భోజనాలయి కూర్చున్నారు. శ్యామలరావు సిగరెట్టు, శ్రీనివాసరావు చుట్ట కాల్చుకుంటూండగా స్వర్ణకుమారి తన తోటలో తయారైన తామలపాకులు రాసి చుడుతూంది. శ్యామలరావు తల వంచుకునే, “శీనూ! వ్యవసాయం చెయ్యడం నాకిష్టంలేదు. చదువుకూ, వ్యవసాయానికి సంబంధంలేదని నేను మొదటినుంచి వాదిస్తున్నాను. శ్రీనివాసరావు ఒకడుతప్ప బుట్టవచ్చుగాక! తక్కినవాళ్ళంతా కొద్దిరోజుల్లో నిజంగుర్తెరిగి నాగళ్ళు నడమధ్యాన్న వదలి స్వగ్రామాలకి వేంచేస్తారని నా గట్టినమ్మకం. వ్యవసాయంచేసేవాళ్ళు వేరు; చదువుకున్నవాళ్ళు పరిశోధనలు చేసి శాస్త్ర పరిశోధనకు కొత్త అధ్యాయాలు చేర్చాలి. కళాదేవిని నూత్నపంథాలలో నడపాలి ఆమెకు నూత్నాలంకారాలు సమకూర్చాలి. అదీ నా ఉద్దేశ్యం స్వర్ణకు ఈ వ్యవసాయంవల్ల అద్భుతమైన అందంపోయి కర్కశమైన అదోరకపు అందంవచ్చింది. అయితే యేమి? తెలిసున్నవాళ్ళు నువ్వైనా ఆమెకు బోధించి, నావెంటపంపు. నేను బెజవాడలో ఒక లలితకళాశాలను యేర్పాటుచెయ్యదల్చుకున్నాను వెన్నెల కిరణాల్లా ప్రసరిస్తూ వీణతీగెల్లోంచి దివ్యగాంధర్వాన్ని ఉద్భవింపచేసే ఆమెవేళ్ళు మొరటుబారి యెల్లా ఉన్నాయో చూడూ! ఇంటికి రాగానే మీ నాన్నగారు ముహూర్తం పెట్టిస్తామన్నారు.’ అనిఅన్నాడు ఈమాటలు వింటూన్నకొద్దీ స్వర్ణకుమారికి మొహం జేవురించింది. చేతులు వణికినవి.

"అన్నయ్యా! శ్యామలరావుయిక్కడ వ్యవసాయం చెయ్యనక్కర లేదు. స్వర్ణకుమారి పెళ్ళి చేసుకోకుండానే అన్నగారికి సహాయంచేస్తూ యిక్కడే ఉంటుందని చెప్పు. రేపు రెండెడ్లబండి రైలుకి మీ శ్యామలరావుని తీసుకువెళ్ళే యేర్పాటు చేయించు" అని కళ్లనీళ్ళు తుడుచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది

౪

ఈ నూతనకృషికాలయంలో ఒకవివాహంకాని యువకుడున్నాడు. భూపుత్రిలా ఉండే స్వర్ణకుమారి, నిజమైన బంగారుపోత్రివని ఆతనినమ్మకం. తనయింట మహారాణిలా ఆమెకు అధికారం ఇవ్వడానికి అతడు ఆశిస్తున్నాడు. ఈ రెండేళ్ళనుంచి తన హృదయదుర్గానికి ముట్టడిచేస్తూన్న ఈ వీరుణ్ణి దూర దూరంగానే ఉంచింది స్వర్ణకుమారి. ఈనాడు శ్యామం తన్ను నట్టేటిలో వదిలివెళ్ళి పోయినట్లు ఆమెకు తోచింది. దివ్యమూర్తిఅనుకున్న తన శ్యామం యింక తనవాడెట్లా అవుతాడు. తనహృదయం గ్రహించలేని వాడు తనవాడు కాదన్నట్టే! ప్రేమలనేవి ఉట్టిపోయాయి. అవి మనుష్యులకుండే హృదయ దౌర్బల్యంగాని, ఉత్తమగుణం కానేకాదు ఆశయాలకు అందలేని ప్రేమతుచ్ఛమే అవుతుంది. వ్యవసాయంచేస్తూ తన అన్నగారితోబాటు నడుంకట్టుకున్న ఆ ఆశ్రమవాసి నిజమైన వీరుడు అతన్నితనకు స్వామిగాచేసుకుంటే అంతకన్న పవిత్రమైన త్యాగం ఇంకొకటి లేదు. తన హృదయవనంలో శ్యామలరావు విషపుమొక్క అయిపోయినాడు. ఆ మొక్కను కలుపు కింద తీసివెయ్యవలసిందేకదా! కళ్ళనీళ్ళుపెట్టుకుంటూ, నిద్రలేకుండా పక్కమీద దొర్లుతూ రాత్రింతా స్వర్ణకుమారి జాగరం చేసింది.

తెల్లవారగానే శ్రీనివాసరావు చెల్లెలిగదిలోకి వచ్చి చూసేటప్పటికి వడిలిపోయినపువ్వులాఉన్న తనముఖం అన్నగారివైపు తిప్పి, స్వర్ణ

"తోటలోకి వెళ్ళే వేళఅయిందా, అన్నయ్యా?" అనిప్రశ్నించింది.

"చెల్లీ! నిన్ను చూసి మరీ వెళ్ళమన్నా, శ్యామం బండెక్కి వెళ్ళి పోయినాడు. ప్రాణంలేని కట్టెలా ఉన్నాడు. మనస్సులో ఉండే ఆవేశాల వల్ల వచ్చేమాటలకు అర్థంలేదు. ప్రేమఅంటే భగవంతునియొక్క అవతారం అని నానమ్మకం, చెల్లీ! అలాంటి ప్రేమను చేతులార తోసిబుచ్చుకోడం మనదేవాలయం మనమే మన నెత్తిమీద కూలదోసుకున్నట్లవుతుంది. నిన్ను విడిచిపెట్టి శ్యామం నిజంగా ప్రాణం విడుస్తాడేమోనని భయం వేస్తోంది. ఎప్పటికైనా భార్యభర్త ననుసరించ వలసినదేకదా చెల్లీ! నేను శ్యామానికి ఉత్తరం వ్రాస్తాను. నిన్ను యింటికి తీసుకువెళ్ళి దిగబెడతాను."

"అన్నయ్యా! నన్ను ఇంటిదగ్గిర దిగబెట్టే దారిలోనే ప్రాణాలు దిగబడతాయి."

"అంత పెట్టితనం ఉండకూడదు తల్లీ!"

"నాకు పెట్టితనమా? నీకా?"

కళ్ళనీళ్ళు కుక్కుకుంటూ స్వర్ణకుమారి దిండులోకి ముఖందూర్చి వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. మంచంమీద పక్కనే కూర్చుని శ్రీనివాసరావు చెల్లెలి వీపు నిమురుతూ,

"చెల్లీ! నేను పొలంలోకి వెడుతున్నాను! తోటపని చూసుకో! ప్రయాణాల మాటలులేవు. అన్నమాటలు ఉపసంహరించుకుంటున్నాను" అని అన్నాడు.

చెల్లెలివైపు పది నిమిషాలు చూసి తలఊపుకుని పెదవి విరుచుకొని నెమ్మదిగా అడుగులు లెక్కించుకుంటూ వెళ్ళిపోయినాడు.

## ౧౪

స్నేహితుడైన శ్యామ్‌ని ఎల్లా ఒప్పించగలడు? చెల్లెలి మనస్సు ఎల్లా తిప్పగలడు. చిన్నతనాన్నుంచీ వీళ్ళద్దరి దాంపత్యమూ ఆతని ఊహాపథంలో ఎంతో ఆనందం సమకూరుస్తూ ఉండేది. శ్యామసుందరంమీద శ్రీనివాసరావుకు వెఱ్ఱికోపం వచ్చింది. ఆడవాళ్ళ హృదయాలు ఎంతకాలం మగవాళ్ళు చేతుల్లో నలిపేస్తారు? పురుషుల ఆశయాలకూ, ఆశలకూ కాంక్షలకూ బానిసలై ఆడవాళ్ళు ఎంతకాలం తుచ్ఛజీవితాలు నడుపుతూ ఉండాలి?

తన కింతవరకు ఏబాలికపైనా ప్రేమ ఉద్భవింపలేదు. అట్టి ప్రేమనిధానమైన బాలిక తన్ను వ్యవసాయం మానివేయమంటే మానివేయవలసిందేనా? అవును. అలాంటి దివ్యబాలిక తన్ను మానివేయమంటే తలవంచి ఒప్పుకోవలసిందే!

ఈ ఆలోచనలతో శ్రీనివాసరావు పరధ్యానంగా వ్యవసాయం సాగించాడు ఆయన పరధ్యానం పెద్దపాలి చూసి "ఏమండి అయ్యగారూ! ఈనాల అదేంటోగా ఉన్నారు" అన్నాడు.

"అదీ లేదు, ఇదీ లేదు పొలం దున్నటం ఈవాళ పూర్తి చెయ్యాలి సోమన్నా?"

"మీ ఎఱుక నిద్రపోతోందండి బాబూ!"

"నా నిద్రే ఎద్దులలో ప్రతిఫలిస్తోంది సోమాయీ!"



# రెండవ భాగము



నెలలు గడిచాయి. శ్యామదగ్గిరనుంచి స్వర్ణకుగాని, శ్రీనివాసులకు గాని ఉత్తరంలేదు. స్వర్ణ ఇదివరకు శ్యామ్ తనకువ్రాసిన ఉత్తరాలన్నీ తిరిగి చదువుకుంది. ఆభాషా ఆ మాధుర్యమూ, ఆచిత్రవిచిత్రభావాలూ ఆమె హృదయాన్ని దహించివేశాయి. నిజంగా తన శ్యామ్ తనకు దూరమై పోతాడా? అతణ్ణి మళ్ళీ చూడడమే పడదా! నిన్ను సర్వకాలాలయందూ హృదయంలో అధివసింపచేసుకుని పూజిస్తూ ఉంటాను అనే వ్రాతలూ మాటలూ వట్టి గాలికబుర్లేనా? ఛీ దొంగస్నేహాలూ, దొంగప్రేమలూ, ఎవరికి కావాలి? అతడు శాంతినికేతనంలో ఉన్నప్పుడు కాశీలో ఉన్న తనకడకురాని నెలలేదు. తనకు శెలవలు వచ్చేటప్పటికి శాంతినికేతనాన్నుంచి మహావాయువులా తనకడకు చేరుకుని శ్యామం తన్ను ఎంత ప్రేమతో అజంతా మొదలైన దివ్య కళాక్షేత్రాలకు తీసుకొని వెళ్ళేవాడు ఆలాంటి ఆ ప్రేమికుడు తనకు ఇంక కానివాడేనా? తన ఆశయాలనూ తన్నూ ఎంత గౌరవిస్తున్నాడు ఈ సుబ్రహ్మణ్యం! వెఱ్ఱిమొఱ్ఱి బొమ్మలూ వెఱ్ఱిమొఱ్ఱి కవిత్వమూ స్పృశింపలేకపోతే మనుష్యుడు కాడా ఏమిటి?

తన అన్నగారు కవా? గాయకుడా? చిత్రకారుడా?



ప్రతివ్యక్తి జీవితంలోనూ ఎవరో ఒకరు ప్రవేశించి ఆ జీవితాన్ని సర్వవిధాలా భగ్నంచేస్తారు. ఎవరు ఈశ్యామ్? ఎవరు తాను! "స్వర్ణా! నా

నాటికి చిక్కి శల్యమైపోతున్నావు- నాలుగురోజులపాటు ఇంటికివెళ్ళి అక్కడ విశ్రాంతి తీసుకుని మళ్ళీ రాకూడదూ? అమ్మ చేతిపాకము రుచి చూస్తే మళ్ళీ గులాబి బుగ్గలు వేసుకు రావచ్చుగా?"

"నావంట బాగాలేదనా? పోనీ నువ్వు తినకు. ఆమాటకే మొదట చెప్పలేకపోయావూ!"

"ఇంతట్లో కోపమా? ఎవరివంట వారికి రుచికాదంటారుగా!"

"అమ్మకు ఎవరు వంట చేసిపెడుతున్నారు- అమ్మ చిక్కిపోయిందా? నావంట నీకు సహించకపోవచ్చును- వంటవాణ్ణి పెట్టుకో!"

"ఈమధ్య నీవు మాట్లాడితే కోపం వస్తూంది- కోపదేవత వయిపోతున్నావు- నీవంటే నాకు ఎంతో అసహ్యంగా ఉంటుంది చెల్లీ! ఇంక శ్యామ్ ఉన్నన్నాళ్ళు ఒకటే పొగడేవాడు నీ వంటని-"

"శ్యామ్ పేరు నా దగ్గర తీసుకురాకు- ఎంత చెప్పినా నువ్వు శ్యామ్ పక్షమే" అని నీళ్ళు రాని ఎఱ్ఱని పొడికళ్ళతో లోపలికి వెళ్ళిపోయింది స్వర్ణకుమారి-

నాగమలరావు వెళ్ళిపోయినప్పటినుంచీ ఆమెకు తోటఅంటే భ[illegible]గా ఉన్నదే- అతనితో కలిసి చదలని ప్రేమంతా ఆమె పూలవనవాటికలో స్వర్ణ స్వయంహాసైన పూవులై కలిసిపోయిన ఆమెలోని అనా సాఫల్యతి బొప్పాయి పళ్ళయి, నిమ్మపళ్ళయి, దానిమ్మపళ్ళయి ఫలించినది- ఆమెతోట కిలకిలలాడి పోతూన్నది.

ఈ తోటవిషయంలో సుబ్రహ్మణ్యము స్వర్ణకుమారికి సైదోడువాడైనాడు- ఆమెమాటే అతనికి రాజశాసనము- ఆమె ఎంత చిన్న కోర్కె కోరినా అతడు తనమహాభాగ్యం కింద ఎంచుకొని నిర్వర్తిస్తూన్నాడు. తన వ్యవసాయస్థితి తగ్గిపోతూన్నదని అతడు గమనించుమానేసు స్వర్ణకుమారికి నానాటికి అతనిపై గౌరవము హెచ్చిపోయినది.

## ౨

శ్రీనివాసరావు వ్యవసాయం దిన దినాభివృద్ధి పొందుతున్నది. చెల్లెలు వేసినతోటతోపాటు పక్కనే మరిమూడుఎకరాలు అన్నిరకములైన ఫల వృక్షములతోనూ నృత్యాలు చేయించినాడు. చెట్లతో ఆడుకుంటాడు. చెట్లతో మాట్లాడుకుంటాడు. ఆతనిమాటలు విని చెట్లు తలయెత్తి ఆతనివంక చూచి కిలకిల నవ్వుతవి. కాయలుకాచిన ఆతని చేతులు తల్లి ప్రేమతో చెట్లను స్పృశించుతవి.

తన పదియెకరముల పొలముచుట్టూ కొబ్బరితోట వేసినాడు శ్రీనివాసరావు. ఒక యెకరము చెఱకు ఒక యెకరము అరటితోట. ఒకయెకరము పాదులతోనిండి సర్వకాలాలయందూ చుట్టుపక్కల పట్టణాల మార్కెట్లును కూరలతో నింపుతుంటవి. తక్కిన మూడుయెకరాలూ ధాన్యం పండిస్తాడు. పది బస్తాలు తనకు సహాయం చేసే పాలివానికిపోయి తక్కిన ఇరవై తనకూ తనచెల్లెలికీ తిండికి మిగులుతున్నవి. తోటలోవచ్చిన రాబడులవల్ల పైఖర్చులూ కొదవ జీతాలూ వస్తున్నవి; ప్రభుత్వం వారిచ్చిన బాకీ తీరుతున్నది.

ఓరోజున తోటలో పని చేసుకుంటున్న శ్రీనివాసరావు దగ్గరకు సుబ్రహ్మణ్యము తల్లివొచ్చింది.

“ శ్రీనివాసరావూ! ఈ ప్రకారంగా వెళ్ళితే పదేళ్ళు దాటితే పొలం నీదైపోతుందికదా? ”

“ మీ ఆశీర్వచనంవల్ల మా పదిమందికీ యీ భూసంపాదన మిగులుతుందనే అనుకుంటున్నాను ”

"ఐతే ఓ ప్రశ్న అడుగుతాను తండ్రీ! కోపపడకుంటే. నీ కనేక సంబంధాలు వొస్తూన్నవి. ఓ చక్కని అమ్మాయిని తీసుకొచ్చి మా కళ్ళకరువు తీరుస్తూ!"

"మీ అబ్బాయికేమైనా సంబంధం ఆలోచించారా యేమిటండీ!"

"అందుకనే వొచ్చాను తండ్రీ! నన్నీ రెండేండ్లనుంచీ మావాడు వేపుకుతింటున్నాడు. స్వర్ణకుమారిని శ్యామలరావుకిస్తారుకదా అనే వుద్దేశంతో ఆమాటెత్తకుండా వూరుకున్నాము. ఇప్పుడలాంటిదేమీ లేదని మావాడు చెప్తాడు. మంచిముహూర్తం చూసి ఇవ్వాళ నన్ను పోరిపంపించాడు. మానాశికి మా వుళ్లో ఓ యిరవైయెకరాల భూమికూడావుంది— ఆ సంగతి నీకు తెలిసేవుంది. మా చిన్నతనంలో పెద్దలు పెళ్ళికూతుళ్ళనే అడిగేవారు. మీ స్వర్ణను మా సుబ్రహ్మణ్యాని కియ్యవలసిందని, నాయనా నీ రెండుచేతులు పట్టుకు అడుగుతున్నాను అమ్మాయి అభిప్రాయం తపకుండా కనుక్కో"

"అదికాదంటే దొడ్డమ్మగారూ! అసలుకీ దానికీ చూడము. మా చెల్లెలియిష్టం యెలావుంటే ఆలా మేము తప్పకుండా జరపవలసినవారమే" అని శ్రీనివాసరావు లేచాడు. సుబ్రహ్మణ్యాంతల్లి చల్లగా వెనక్కి వెళ్ళిపోయింది.

"శ్యామ్ వుట్టివెర్రివాడు. వాడు వుట్టిస్టూల్. ఇంతప్పటినుంచీ ప్రేమించిన అమ్మాయిని కుక్కనపేనులాగ కిక్కురుమనకుండా ఇక్కడ వదిలి వేసి వెళ్లిపోయాడు. ఇంతైనా వాడికి పౌరుషంలేదు. వాడి ప్రేమ వొత్తపుల్లక్కి వీళ్ళిద్దరి ప్రేమా చూస్తూ ఎంత ఆనందపడేవాడు తాను స్వర్ణ హృదయం వాడేమి తెలుసుకున్నాడు. ఆఁ! కళలట! కళోపాసకుడికి అందరి

హృదయాలూ తెలుస్తాయంటారు, వట్టి బూటకము. ఈ సుబ్రహ్మణ్యం ఎక్కడ దాపురించాడు బాబూ! ఇంతకూ ఎవరికర్మ వారిది " అనుకుంటూ ఆరడుగుల శ్రీనివాసరావు ఏనుగు గున్నలా విస విస యింటివైపు నడిచి పోయాడు.

## ౩

శ్రీనివాసరావు యిల్లు తన స్వహస్తాలతో నిర్మించుకున్నాడు. స్వర్ణ దాన్ని అలంకరించింది. తోటలమధ్య ఆయిల్లు మణిపూసలా వెలిగిపోతూ వున్నది. శ్రీనివాసరావు జీవితంలో ధ్వనిలేదు. అంతా వాచ్యమే. ఏది చెప్ప దలచుకున్నా డొంక తిరుగుళ్ళు తిరక్కుండా, మొహమాటం లేకుండా క్రమవిరచినట్లు చెప్తాడు_ కోపమంటే ఎరగడు. కోపంవస్తే లయకాలరుద్రుడే. అసత్యవాదులంటేనే అతనికికోపం_ అతనంటే అందరికీభయమూ, భక్తి కూడాను. అలాంటి శ్రీనివాసరావు ఏదో గొణుక్కుంటూ ఇంటిలో ప్రవే శించాడు. తన పడుకునే గదిలోకి వెళ్ళి తక్లీన్నీ యేకులూ తీసుకుని వినోబా భావే విధానాలతో త్వర త్వరగా దారం వడకడం ప్రారంభించాడు ఏ ఆలోచనా తోచనప్పుడాతడు దారం వొడుకుతూంటాడు. తన కట్టుబట్ట లన్నీ అతడు వొడికినదారమే. "స్వర్ణా స్వర్ణా" అని చెల్లెలిని తన గంభీర కంఠంతో పిలిచాడు. తోటలో చెట్లకు నీళ్ళుపోస్తున్న ఆ బాలిక వనలక్ష్మిలా పరుగెత్తుకువచ్చింది

" ఎందుకన్నయ్యా పిలిచావు ? "

"పిలిచానమ్మా! చాలా ముఖ్యమైనకారణమే వున్నది_ నీకు పెళ్ళి వారు వొచ్చారు_ ఇదివరదాకా దూరంగావున్న వారు యిప్పుడే దగ్గరకు వొచ్చారు నన్నుద్ధరించటానికి!"

"ఏమిటన్నయ్యా? అలావున్నావేమిటి? ప్రసన్నంగావుండే నీ నుదురలా ముడతలు పడిపోతుందేమిటి? ఏదో కోపంగా వున్నావు. నాకు పెళ్ళివొద్దని యిదివరకే నీతో గట్టిగా చెప్పివున్నాను. ఈ భూమంతా నీదైనప్పుడు, అప్పుడు చూసుకుందాములే!"

"నాకదంతా తెలియదమ్మాయ్, శ్యామునికీ నీకూ చెడిపోయిందటగా. ఇంక అడగనచ్చునట! ఆసంగతి వాళ్లకు తెలిసిందట. తెలిసిందటమ్మా! సుబ్రహ్మణ్యంతల్లి తన కుమారుడికి నీ పాణిగ్రహణం కోరి రాయబారం వొచ్చింది. నీయిష్టం!"

ఇంత విరసంగా తన అన్నగారెప్పుడూ తనతో మాటాడలేదు. ఆతడు చెప్పినమాట లామెకు తిన్నగ యెక్కనేలేదు. ఆరునెల్లకిందట శ్యామం తనతో ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయాడు. ఏమయినాడు? చెవులు అడ్డం పెట్టుకున్నా తనతోటలోని పువ్వులలోనుంచి అతనిపాటలు వినవస్తూనే వున్నవి. కళ్లకు అడ్డంపెట్టుకున్నా నాగలి నాగేటిచాలు, ఆదూరాన కొండలూ అతనిచిత్రాలను ప్రతిఫలిస్తూనే వున్నవి. తన హృదయంలోని అతని విగ్రహము స్పష్టరేఖామూర్తిగా చిరునవ్వులు నవ్వుతునే వున్నది.

తోటపని చేసికొనివచ్చి ఎంత తియ్యగా శ్యామలరావు నవ్వుల్ని కలలుగంటూ వుండేది. ప్రతి పుట్టినరోజుకీ తన కొకబహుమతి యిచ్చేవాడు. చిత్రాలు, చిత్రవస్తువులు, చీరెలు, కుంకుమభరిణెలు, వెండివస్తువులు, గంధపు చెక్కడాలు శ్యామ ప్రేమతో అర్పించినవి కావూ?

"నిన్ను పూజిస్తానె స్వర్ణపానీ!
నీవు నా ఆశవే స్వర్ణపానీ!"

అన్న ఆతనిపాట తన నర నరాలలో తీగలు మీటుతున్నది. ప్రత్యూషపవనాలే ఆతని ముంగురులై, సాయంసంధ్యాకిరణాలే ఆతని మాటలై, నిండుజ్యోత్స్నలే ఆతని ఆటలై తన జీవితమంతా నిండుకొన్న శ్యామ్ తన చెయివదలి ఒక్కడూ, ఒక్కడూ వెళ్ళిపోయాడు.

తల్లిదండ్రుల అనుమతిఅడిగి ఏసంగతీ చెప్తానని సుబ్రహ్మణ్యముతల్లితో చెప్పమని అన్నగారిని కోరినది స్వర్ణ.



శ్యాముకు జీవితమే భగ్నమైనది. స్వప్నాలు శకలములైనవి. ఒంటిగా ఈబ్రతుకు ఎడారిలో వేడిగాల్పులు వీస్తూవుంటే ఇసుకలో కాళ్ళు దిగబడుతూ ఎంతదూరం నడవగలడు తాను? కుంచెలకు చివరవున్న "సేబులు" చెంద్రుకలలోని ఎర్రటి రంగు ఆకాశంఅంతా ఎర్రటిమరకలతో నింపింది. గొట్టాలలోని రంగులు కర్రబారినవి. చిత్రలేఖనపు కాగితాలు ఎండి పొడి పొడిగ రాలినవి. ఎప్పుడూ తనకు చెలికత్తెలావున్న అలంకార దేవత మాసిన చీరెకట్టుకొని వివర్ణవదనంతో వెడలిపోయింది.

" ఆనంద మేలనే,
అమృత వీచిక లేల?
అడు గడుగున తగులు
నిడివి ముల్లులదారి!
ఆనందమేలనే?

కల లేల బ్రతుకులో ?
సెలయేటి ఝరి యేల ?

ధూళి నిండిన బ్రతుకు
తూళి విరుచుకు పడెనె!

ఆనంద మేలనే
అమృతవీచిక లేల

కారు రంగుల వచ్చు
కల్లోల ఫేనాన
తడిలేని కణమైన
ధావళ్యమే కళలు

ఆనంద మేలనే?
అమృతవీచిక లేల? "

పరికిణీ కుచ్చులు జారాడగా పరుగెత్తుతూ, మెళ్లో హారాలు గలగలా పాటలు పాడుతూ చిక్కులు పడుతూంటే తనతో ఆడుకున్నప్పుడు చిన్నతనంలో స్వర్ణంలోని ఈ కర్కశత్వపు బీజాలు ఎక్కడా కనబడలేదే!

అప్పుడే పయ్యెద సవరించుకొన్ననలు తాల్పు నవయౌవనపు తొలి పొద్దులలో ఆమెలోని వినూత్న పరిమళాలు ఈలాంటి కటువు వాసనలతో మిశ్రమము కాలేదే! ఆమె అన్నగారు, తన ఊరు తన స్నేహవాంఛకై వచ్చినప్పుడు ఆబాలిక తనలోని దివ్యసౌందర్యము వికసించే రోజులలో ఎవో కొత్త అందాలు సేకరించుకొనే గాఢ సురభిళ ఘటికలలో తనకై అన్నతో ఆమె వెన్నంటివచ్చిన శుభముహూర్తాలకు అర్థమే లేదా?

తనకూ, తనస్నేహితుడు శ్రీనికీ వాదాలు మ్రోగిపోయినప్పుడు అన్నగారికి వ్యతిరేకంగా ఆబాలిక తనపక్షం వహించి వాదించిన తియ్యటి వాదనలకు ప్రయోజనమే లేదా! తన జన్మలో జన్మ. తనప్రాణములో ప్రాణమూ,

ఆత్మలో ఆత్మ ఐన కళను వదలాలా? తన జన్మలో జన్మ, ప్రాణములో ప్రాణమూ, ఆత్మలో ఆత్మ ఐన ప్రేమనువదలాలా?

కళ తన ఆశయమూ, నిదానమూ! కళకోసమేకదా ఉద్యోగవాంఛ పూర్తిగ నాశనం చేసుకున్నది? ఈ ప్రేమబాలిక స్వర్ణకుమారి, ఆ కళతో రేఖకు రేఖా, వర్ణానికి వర్ణమూ, మూర్తికి మూర్తీరూపము పొందినదే. కళ వల్లకళాస్రష్ట లోకానికీ, లోకస్వరూపుడైన భగవంతునికి సేవ చేస్తాడు. ఆ సేవలో కళాస్రష్ట తన సర్వస్వమూ ఆహుతి చేయవలసి వుంటుంది. అదే మహాయజ్ఞము— ఈ దివ్యత్యాగమే కళను ఉత్కృష్టపథాలకు తేల్చివేస్తుంది.

ఒక కళావ్యక్తి తన కళవల్ల లోకానికి సేవ చేస్తున్నాననుకోవటము తన్ను తాను మోసం చేసుకోవటం కాదా? కళ లోకానికి సేవ ఔతుందా? కళాకారుడని పేరువొస్తుంది— అలా పేరు రావడం ఒకని అహంకారానికి అలంకారం ఔతుంది గాని, పూజాస్వరూపము కాగలదా? తాను బూదిలో కలిసిన వెనుక కూడా తన పేరు నిలిచివుండనే భావము అహంకారానికి అధిస్థితి.

జీవించి వున్నన్నాళ్ళు కలిగే అనుభవాలే మోక్షస్వరూపాలౌతవి— జీవితానికి ఉత్తమానుభవము ప్రేమ— ప్రేమకోసం రాజ్యాలు వొదలిపెట్టారు ఎనిమిదవ ఎడ్వర్డు మొదలైన చక్రవర్తులు చిన్నతనాన్నుంచి తాను నమ్మిన ఒక బాలిక— తన జీవిత సర్వస్వమూ, తన సౌందర్య సర్వస్వము తనకు అర్పించటానికి సిద్ధంగావున్న ఒక బాలిక, ఇప్పుడు తన విషయంలో నిస్పృహ చెంది కృశించి పోవలసిందేనా?

ఐతే ఆమె మాత్రం తన ఆశయాలు ప్రేమకోసం ఎందుకు ఆహుతించ కూడదు? యుగ యుగాలనుంచీ ఆడవాళ్ళను కాలిక్రింద నేలరాశారు మగ

వాళ్లు- వాళ్ల సర్వస్వమూ భర్తలకోసము ఇదివరదాకా త్యాగాగ్నులకింధనంపోశారు- దివ్యసౌందర్యవతియైన ఒక బాలిక కోసం తన సర్వస్వమూ త్యాగము చేసికోవటములో ఉత్తమత్వంవున్నది గానీ. ఆమెను త్యాగం చేసుకొని రమ్మనటంలో లోక సాధారణగానే పరీక్ష మాతున్నది.

తనతో ఆమె ఒంటరిగ వాహ్యాళికి, సినిమాకూ వొచ్చినరోజులు, తన మాట వినేటప్పటికే ఆమె ఉప్పొంగిపోయిన ఘడియలు, తనామె స్పృశించినమాత్రాన తన దేహమంతా, తన మనస్సంతా విద్యుత్తరంగాలు ముంచివేసిన శుభ ముహూర్తాలూ ఇప్పుడు, అర్థంలేనివై పోవలసిందేనా?



"నాన్నగారూ! నేను వ్యవసాయం చెయ్యాలని సరదా పుట్టింది. మన మెరకపొలంలో రెండెకరాలు నాకివ్వండి. అందులో మంచితోట వెయ్యాలని వుంది" అని తండ్రినడిగాడు శ్యామలరావు.

శ్యామలరావు వూరు బెజవాడ బందరు రోడ్డుప్రక్క కంకిపాటికి ఇవతలవున్న ఇందుపల్లి గ్రామం. శ్యామలరావుతండ్రి సుబ్బయ్యగారు కుమారుణ్ణి చూసి "అబ్బాయీ! వ్యవసాయం యేమిటోయ్? రెండు మూడు మంచి ఉద్యోగాలను వీళ్ళువస్తే అక్కరలేదని తోసేశావు బెజవాడలో ఏదో కాలేజీ పెట్టాలనన్నావు. నీకు నిమిషానికో ఆలోచన. మనస్సు నిలుకడ లేదాయెను" అని కొంచెం కోపంగా అన్నారు.

"మీరు గట్టిగ వొద్దంటే మానేస్తాను నాన్నా! నాకు ప్రతిదీ మీరు సంభవించేటట్టు చేశారు మీ ప్రేమకు ఎప్పుడూ కృతజ్ఞుణ్ణి. ఈ ఒక్క కోరికా తీర్చండి ఈ కోర్కెకూ, నా జీవితానికీ చాలా సంబంధంవుంది."

"అబ్బాయీ! తోట వేయడమంటే చాల డబ్బు ఖర్చౌతుంది"

"ఏదో కొద్దిఖర్చుతో తోట వేయాలని వుండండీ మనకున్న స్థితిలో మనకుటుంబాలకు డబ్బు కష్టసాధ్యమే. చదువుకోసం మీరు పంపించిన రూపాయలలో కొన్ని ఖర్చుచేయకుండా బ్యాంకులో ఉంచాను. అదే నా నాగలి దున్నటానికి పెట్టుబడి."

"నాన్నా! నీ ఆరోగ్యం అంత బండరకపుది కాదురా! ఈ బండ పనిలో ఎందుకూ పనికిరాకుండా పోతావు, సందేహం లేదు"

"డాక్టర్లూ, దేశనాయకులూ మళ్ళీ భూమాత పాదాలకడకు చేరండి దేశ సౌభాగ్యమూ, ఆరోగ్య సౌభాగ్యమూ, అక్కడే ఉన్నది? అంటున్నారండి నాన్నగారూ!"

"ఉల్లికోడుపాలెం నూతిదగ్గర ఒకయకరం దొడ్డికచుట్టూ వెదురు కంచెకట్టమంటాను వెంకన్నని. మొదలెట్టు. ఇదో ఈనాళ్ళ ముచ్చట. తర్వాత నేను చెప్పలేదనిమాత్రం అనకు."

ఉల్లికోడుపాలెంలో యెకరంతోట విభాగించారు. ఆ తోటలో నాగేటిచాలు నవ్వింది. బెజవాడ ముష్టివారి దుర్గానర్సరీ నుండి అంట్లూ విత్తులూ బళ్ళమీదవొచ్చి తోటంతా ముట్టడించాయి. అద్దెకు తీసుకువచ్చిన మోటారుపంపు అమితవేగంతో పాతాళగంగాగానాన్ని శ్యామలుని కంఠానికి తగిలికలిపింది.

తోటకూర, గోంగూర, మెంతికూర కొత్తిమీరమళ్ళు, ఒకప్రక్కన కాబేజీ, కాలీ, ముల్లంగి కారెటు విత్తనాలమళ్లొకప్రక్క. పచ్చని మొక్కలతో పక పకమన్నాయి. మామిళ్ళు, సపోటాలు. తీపినిమ్మలు బత్తాయిలు నిమ్మలు బలమైన అంట్లు బార్లుతీర్చినవి. బొప్పాసిమొక్కలు, కొబ్బరిమొ

క్కులు తోటచుట్టూ కంచె పక్కనే కాపలా కాస్తున్నవి. ఒక మడిలో ముప్పైరకాల గులాబీలు, కేర్లయిన్‌డి ఆర్డెన్, పాల్నెరాన్, తెల్లఅమెరికను సుందరి పుష్పాలతో అలంకరించుకొని గాలిలో నృత్యాలు సల్పుతున్నవి.

మూడు నెలలు ఒళ్ళు తెలియకుండ స్వర్ణకుమారి పేరు మంత్రంకాగా శ్యామలుడు ఆరోగ్యం అంతా హూనం చేసుకున్నాడు. అతని చిత్రలేఖనం బొగ్గైన విల్లాలలో, అతని కవిత్వం తీగసంపెంగలో, అతని మధుర కంఠం మాలతీ మాధవీ లతలలో, రంగులు దాల్చి సంయోగసుల నడిచి తాళ గతిపై ప్రసరించి పోయినవి.

పెద్దపాలి వెంకన్న ఎంతో సాయము చేశాడు. పలుచని సున్నితమైన అతని శరీరము తన పాతబంగారు ఛాయతో విసిపుచ్చుకొని కరిపడి నల్లపడిపోయింది. అతని ఫాలంలోని కాంతి, కళ్ళల్లోని నృత్యము, పెదవుల్లోని హాసము మటుమాయమైపోయి నాగేటి చాళ్ళకు ఎరువుగ రాలినవి.

## ౬

స్వర్ణకుమారి కనుల క్రింద కీ-నీడలు బయలుదేరినవి. అందమైన వంపులు సేకరించుకొన్న ఆమె పెదవులు తడి రబ్బరుతో చెరిపిన రేఖలులా మరకలు పడినవి. కొద్దివంపు తిరిగిన ఆమె చిత్రమైన ముక్కు సన్నగించి నిజముగ శుకనాసిక యైనది.

శ్రీనివాసరావు ఆమె భుజములు రెండు అదిమిపట్టుకొని "చెల్లీ! నీకు మతిలేదు_ నాకు పౌరుషంలేదు. మనిద్దరికీ బుద్ధిలేదు. నీవీ సుబ్రహ్మణ్యాన్ని పెండ్లిచేసికొందామనేనా? నాన్నా అమ్మా దగ్గరనుంచి నీకిష్టమైతే

సంబంధం వొప్పుకో వొచ్చునని నాకు మూడు దినాలై పుత్తరం వొచ్చిన సంగతి యెరుగుదువుకదా? అంతభారం నీనెత్తిమీదే పడింది. వాళ్ళమ్మ నన్ను రోజూ అడుగుతుంది. ఏదో జవాబు చెప్పకపోతే నేను వొత్తి మూర్ఖుణ్నౌతాను. ఇప్పటికైనా—"

"ఏంచేయమంటావన్నయ్యా! లోకమంతా ఆడవాళ్ళని పశ్చాత గొట్లాలని ప్రయత్నం చేస్తూనే వుంటుంది. నువ్వుకూడ లోకముతో పాటు వాడివే అయ్యావు. నాన్నా అమ్మా యిచ్చిన అధికారం నీనెత్తిమీదే పెట్టాను. నువ్వేచెయ్యి."

"ఇదిగో సోనూ! నన్ను పిచ్చివాణ్ణిచెయ్యకు చిన్నప్పటినుంచీ నువ్వు కొండమీద కోతిని తీసుకువచ్చి యివ్వమంటే తెచ్చియిచ్చాను. నా ఆలోచనలు మగవాడి ఆలోచనలు."

"నేను వొట్టిదద్దమ్మ ఆడదానిని."

"నీకెప్పుడూ సహజంగా వుండే నిదానమంతా యేమైపోయింది మాట్లాడితే తోకతొక్కిన తాచుపాములా లేస్తున్నావు."

"మాటలతో నన్ను బాధించకపోతే ఒక కొరడా తీసుకోరాదూ."

"అయ్యో! వెర్రితల్లీ! నువ్వేదిచెయ్యమంటే చేస్తాను. నీయిష్టంవొచ్చినట్టుగ ఆలోచించుకొని నువ్వు ఆజ్ఞయిస్తే పాలించటం నావంతు. దీనికి మిన్నువొచ్చి మీదపడినా సాలెగూడును దులిపి వేసినట్టు దులిపివేస్తాను."

స్వర్ణకుమారికి కళ్ళు చెమరించినై. "అన్నయ్యా! క్షమించు నాకు మతిపోతూన్నది. సుబ్రహ్మణ్యం తల్లితో సంబంధం ఖాయమని చెప్పు. నాన్నకూ అమ్మకూ ఉత్తరం వ్రాయి—"

"తల్లీ! ఆలోచించుకొని చెప్పుతున్నాను"

"వళ్ళి మొదలు పెట్టావూ! ఐతే నీయిష్టమే—"

"అబ్బా! ఎంతకోపం వచ్చేస్తుందమ్మా నీకు? ఈ తక్షణం వెళ్ళి సుబ్రహ్మణ్యం తల్లితో చెప్తాను. అమ్మకీ నాన్నకీ వుత్తరం వ్రాస్తాను. నువ్వు తొందరగా పెట్టించమంటే తొందరగా, ఆలస్యంగా పెట్టించమంటే ఆలస్యంగా ముహూర్తం పెట్టిస్తాను."

"ఎంత తొందరగా ముహూర్తం పెట్టించగలిగితే అంత తొందరగా పెట్టించు. భారత సౌభాగ్యం ఆలోచనలతోనూ ఆలస్యాలతోనూ వెనక్కి పోతున్నది. ఒక వ్యవసాయదారుని చెల్లెల్ని ఒక వ్యవసాయదారుని అర్ధాంగిగ, హో, హో, హో."

ఆమె నోట్లో తెలియని నవ్వు నవ్వుతుంటూ ఆనవ్వులో విరుచుకుని మూర్ఛలో పడబోయింది. పడబోయే చెల్లెల్ని చివాల్న ఎత్తుకొని రెండంగలల్లో ఆమె గదిలోకి తీసుకువెళ్ళి మంచంమీద పడుకోబెట్టి పక్కనున్న కూజాలోని నీళ్ళు ముఖంమీద చల్లి పక్కనే కూర్చొని నవ్వాపాడు. ఆమె గడ గడ వణికింది.

"షాక్! కంగారు పడకమ్మా! మేమంతా కలిసి నీకు రాక్షసులమైనాము. క్షమమునుదను శోకపంద ఇదిగో ఈ మందుపుచ్చుకుని పలకకుండా పడుకో. మామూలుదానవౌతావు" అంటూ శ్రీనివాసరావు తన గదిలోకి పరుగెత్తివెళ్ళి తనవద్ద యెప్పుడూ సిద్ధంగావున్న మందులపెట్టె పట్టుకువచ్చి యింత బ్రోమైడు యిచ్చి తల నిమురుతూ ఆమె నిద్రపోయే వరకు కూర్చున్నాడు. బలపూర్ణములైన సమ్మోహన శక్తిగల అతని హస్త

తలప్పగ్గళ్లో ఆ బాలిక నెమ్మదిచెంది చల్లగా నిద్రాదేవి ఒడిలో మైమరచినది.

ఆ సాయంత్రం బండికట్టించి ఐదుమైళ్ళలో వున్న రైలుస్టేషను చేరుకున్నారు, అన్నా చెల్లెళ్ళు. శ్రీనివాసరావు తన చెల్లెల్ని స్వగ్రామమైన బెజవాడ తీసుకు వెళ్ళాడు.



## మూడవ భాగము



స్వర్ణకుమారితండ్రి తన కుమార్తె సుబ్రహ్మణ్యాన్ని పెండ్లి చేసుకోటానికి నిశ్చయించుకుందని సుబ్బయ్యగారికి ఇరుపక్షాల ఉత్తరం వ్రాశాడు. ఆ కిందటరోజునే వొంట్లో బాగాలేదని శ్రీనివాసరావు చెల్లెల్ని తీసుకవొచ్చి ఆమె ఆరోగ్యంతో తిరుగుతూ వృందావనం చూచి వారంరోజుల్లో తిరిగి వెళ్ళిపోయాడు.

స్వర్ణకుమారికివచ్చిన అనారోగ్యం విషయంలో సుబ్రహ్మణ్యంమాటే మరచిపోయిన శ్రీనివాసరావు కొంత కాలమైందాకా యేమాటా సుబ్రహ్మణ్యంతో తేల్చకూడదని నిశ్చయం చేసుకున్నాడు. ఈ సంగతి స్వర్ణకుమారికి గాని వారితండ్రి రాధాకృష్ణయ్యగారికిగాని తెలియనీయలేదు. అన్న

గానీ సంగతి సుబ్రహ్మణ్యముతో చెప్పినట్లే భావించుకొన్నది స్వర్ణకుమారి. ఆమె హృదయంలో నుంచి ఎంత చెరిపివేసుకుందామనుకున్నా శ్యామలుని చిత్రం మాయంకాదు. నవ్వుతూ నాట్యం చేసే కళ్ళతో పెదవులతో ఆతడామెకు సర్వకాలమూ ప్రత్యక్ష మౌతూనే వున్నాడు.

రెండేండ్ల నాడు తన పుట్టినరోజున ఆతడు బహూకరించిన 'విశాల భారతి' అనే ఉత్కృష్ట చిత్రము తన పడకగదిలో ఎట్టఎదుట గోడను వ్రేలాడుతూ వున్నది. రెండెడ్లబండి కొండలూ పొలాలూ మధ్య ప్రాంతంలో వెళ్తూన్నది. ఎత్తైన బస్తాలమీద చిన్నపరిగా రోకను ధాన్యపు వెన్నులలోని గింజలు తీసుకుని నములుతూన్నాడు. కొండలూ, పొలమూ, చెట్ల యొక్క సౌందర్యము అలవరచుకొన్న బలిష్ఠుడైన రైతు బండి తోలుతూన్నాడు. ఆకాశమూ, తీగలూ పుష్పాలూ అందాలు పుణికి పుచ్చుకొన్న ఆ రైతు భార్య బండి వెనక నెత్తిమీద తట్టతో నడిచి వొస్తూన్నది. దూరాన ఆ లోయలో ఒక వృద్ధుడు సూర్యార్ఘ్యమిస్తూన్నాడు ఆకాశంలో పైన తదియ నాటి చంద్రవంక. ఈ రెండునూ "విశాలభారతి"లోని వృద్ధత్వమూ నవ్యత్వమూ చాటుతూన్నవి. భారతీయ సిద్ధాంతాన్ని చిత్రించిన అద్భుత చిత్రమిది. లక్నో ప్రదర్శనంలో ప్రథమ బహుమతి నందినది

ఆ చిత్రము దివ్యము. ఆ చిత్రించిన చిత్రకారుడు తనకు దూరమై పోయాడు. అల్లరివాడు. ఎప్పుడూ తనను నవ్వించేవాడు. ఆతడు తన జీవితాన్ని ప్రతిక్షణమూ స్పృశించి తనకైవసం చేసుకొన్నాడు. తా నాతని కళ్ళల్లో కాంతులు పొందింది. ఆతని నవ్వుల్లో నాట్యమాడింది. "నువ్వు నాకు స్వర్ణదేవివి. నీ మందహాస పవిత్రకరణంలో నా జీవితము నాకే పుష్టిచేర్చుకుంటుంది స్వర్ణరాణీ" అని తన్ను ఆతని హృదయాని కద్దుకొన్న

గంగానదికడ ఒకదివ్యక్షణం ఆమెకు స్ఫురణకు వొచ్చింది. ఆ నాడామె పొందిన మహదానందము క్షణికమాత్రమే ఐంది. తన మాటలకే కోపంవచ్చి ఆతని సహజామృత రసప్రవాహంలో తన కోపం తీర్చక పిరికివానిలా వెళ్ళి పోయాడు.

తాను కోరేది దేశ సౌభాగ్యం దేశసౌభాగ్యాని కాధారం నాగలి. నాగలీ! నువ్వు వేదానివి నువ్వు పురాణేతిహాసవు, నువ్వు భగవద్గీతవు. నువ్వు భారతీయహృదయానివి. నీవల్ల పాశ్చాత్య నీచభావ నీరసం పోవడం మాదుర్బలత్వాన్ని ఏనాటికానాడు పటాపంచలు చేస్తున్నావు. శ్యామసుందరుడు నాగలి పట్టుకపోతే నేమి? నాగలిని కీర్తించే కళా సృష్టి తావులేదా? లలితంగా కుంచెను పట్టుకునే చేయి కర్కశంగా మేడితోకను పట్టవలసిందేనా? నాగలినీ నాగేటిచాలునీ కీర్తించటము దేశసేవకాదా? శ్యామసుందర్! నువ్వేమిచేస్తూ వుంటావు గంగవొడ్డున నీవుచేసిన బాసలు, అన్నగాంభీర్యంలో నీ డగ్గుత్తిక కంఠం, అర్థంలేనివేనా శ్యామూ?

౨

అనవసరమైన సౌరభాలను అవతల అప్రతిహతమైన శాంత కాంతి వెలుగుతూ ఉంటుంది మనుష్యుని జీవితంలో ఎంతలోతైనా తవ్వే నూతులలో పాతాళగంగా ప్రవాహాలు సాగిస్తాయి గాని తన హృదయంలో కఠినమైన పైభాగం తప్పుకొని తన ఉత్తమత్వం తాను తెలిసికోలేదు. తనచెల్లెలి దాలోటు, తన ప్రాణమిత్రుడు శ్యామలునిదా? ఈ రెండు జీవితాలు భగ్న

మయితే తాను బాధ్యుడుగాక ఎలాగు? అసలు సత్యానికి దూరమైన వంకరలు భావాలు నిజమని తోస్తే, వాటినే నమ్మి జీవితం భగ్నం చేసుకోవటంలో ఎంతమంది ఆరితేరినవారో!

శ్రీనివాసరావుకి వ్యవసాయంపైని మనస్సుపోవటంలేదు. సుబ్రహ్మ ణ్యం వచ్చి మాట్లాడడమే అపశ్రుతిగా తోచేది. వ్యవసాయమంతా మానేసి ఎక్కడికైనా పారిపోవాలనుకొన్నాడు.

◆ ◆ ◆

బెజవాడలో అటూ ఇటూ తోచక తిరుగుతూ, వ్యవసాయంలో అన్నగారూ ఒక్కరూ ఉన్నారు, అక్కడికి ఎందుకు వెళ్ళకూడదా అనుకుంటుంది స్వర్ణకుమారి. అక్కడ ఆ సుబ్రహ్మణ్యం వచ్చి పలుకరిస్తాడు వెఱ్ఱివాడు, పాపం! అతనికేమి తెలుసును తన హృదయంలోని గాఢమైన భయంకరమైన ఈ ఆవేదన? ఆ శ్యామంమీద కోపంకొద్దీ ఈతన్ని తన జీవితంలోకి రానిచ్చింది. అవును అందువల్ల తనకొచ్చేమిటి? తన జీవితపథమూ, తన ఆశయాలు, తన స్వప్నాలు గుర్తించలేని ఒక మూఢుడు తన జీవితభాగస్వామి ఎట్లా అవుతాడు! ధైర్యమూ పట్టుదలా, గట్టితనమూ లేని నీరస స్వభావం ఆతడిది అవడం చేత తానిల్లా బాధపడుతోందిగాని, ధీరస్వభావులగు ఉత్తమస్త్రీలు ఈ అటు నిటు ఆవేదనలలో అల్లాడి పోనేపోరు.

◆ ◆

తన వ్యవసాయం ప్రారంభం అయి నాలుగు నెలలయింది. ఈతోట వేయడంలో ఏమి కొత్తతనం ఉంది?

కళలలో సర్వకాల నవ్యత్వముంది. విధానాలు కొత్తవి. కళలలో పరిశోధన చేయవచ్చును. 'డాడా ఇజమో, ఫ్యూచరిజమో, ఇంప్రెష నిజమో, ఎప్పుడూ కళాప్రపంచంలో ఉద్భవిస్తూ ఉంటవి.

వ్యవసాయంలో నవ్యత్వం లేదా! ఎప్పటికప్పుడు కొత్త కొత్త రీతులు రావటంలేదా? కృషీవలుడు మాత్రం ఒక రకమైన కళాస్రష్టకాడా? కొత్త రకపు పంటలు అనేకలు పండిస్తున్నారు. స్రష్టఅయినవాడు తోటలు వేయడంలో కొత్తరకపు పూలు, పండ్లు ఎప్పటికప్పుడు, కల్పించడంలేదా?

కళ మాయ! ఊహాప్రపంచంమాత్రం వట్టికల్పన. ధరిత్రీమాతృకృషి సత్యమైనది. అందువల్ల వచ్చేఫలితం కళ్ళఎదుట మూర్తిస్తుంది.

ఈ ఆలోచనలతో శ్యామలరావు నుదురున చెయ్యిపెట్టుకుని కూర్చున్నాడు. అప్పుడే సుబ్బయ్యగారాయన దగ్గరకు వచ్చారు.

" నాన్నా! నా నాటికి తీసికట్టు నాగంభట్లా పోతూన్నావురా! ఏమీ తోచనమ్మ ఏతా మొత్తటం ప్రారంభించిందట. డబ్బిచ్చి తద్దినం కొని తెచ్చుకుంటే వేయిచ్చినా వెళ్ళదట. ఆలావున్నది నీవిషయం. కళ్ళునూతులై పోయాయి బోగ యొంకిపోయింది. రాత్రిళ్ళు దగ్గుతూవుంటే నా గుండె గుభేల్లు మంటుంది "

" నా వొంట్లో బాగానే వుంటున్నదండీ నాన్నగారూ!"

" ఈరోజుల్లో పెద్దవాళ్ళు చెప్పటం చిన్నవాళ్ళు వినడం పోయిందిగా! అంతా బోల్షివిష్టులు. మేంచేతుల్లో నడుస్తాము; అద అందంటాం టాడు. ఏక్షయైనా వొచ్చిందంటే నుయ్యో గొయ్యో చూసుకోవాలి మేము. వరప్రసాదంలాంటి కొడుకని మీ అమ్మ గోలపెట్టోంది. మా కడుపున పుట్టింది నీవొక్కడవు. "

" మీకు చాద స్తమండీ?"

" ఔను! మాకు చాద స్తం. నీకు నిదానం. నువ్వెందుకు వ్యవసాయం తీసుకున్నావో నాకు తెలియకపోలేదు. బెజవాడలో రాధాకృష్ణయ్యగారి కుమార్తె స్వర్ణకుమారి అన్నగారితో పాటు వ్యవసాయం చెయ్యటానికి పంతి లూరు వెళ్ళింది కదా! ఆ అమ్మాయితో పాటు నువ్వూ ఎందుకు వ్యవసాయం చెయ్యకూడదని నీకు బుద్ధిపుట్టింది."

" నాన్నగారూ! మీ రనవసరంగా నన్ను బాధ పెట్టటాని కీవ్వాళ తలచుకున్నట్టుంది"

" ఓయి వెర్రివాడా! నేను బాధ పెట్టట మేమిటి? చిన్నతనాన్నుంచీ ఆ అమ్మాయిని నీకిస్తాననటం, నేనూ రాధాకృష్ణయ్యా ఈ విషయం నిశ్చయించుకోవడం, అందరు పెద్దలు ఆశీర్వదించటం జరిగింది. నువ్వు చదివే కాశీలోనే ఆ అమ్మాయి చదవటం, మీరిద్దరూ ఒకరినొకరు పెండ్లి చేసుకుంటారని అనుకోవటం లోకమంతా ఎరుగును"

శ్యామలుడు మౌనం.

" నెలరోజులకిందట ఆయన ఓ ఉత్తరం వ్రాశారు. వాళ్ళమ్మాయి స్వర్ణకుమారి శ్రీనివాసరావుతోపాటు వ్యవసాయం చేస్తున్న ఒక అబ్బాయిని పెండ్లి చేసుకోవడానికి నిశ్చయించుకుందనీ, తనకు పట్టుదలతో పట్టుపట్టడంచేత తాము ఆమోదించవలసి వచ్చిందనీ తన్ను క్షమించవలసిందని ఆయన వ్రాశారు. నీ మనస్సు బాధపడి పోతుందని నీకిప్పుడాఉత్తరం చూపలేదు."

శ్యామలుని మోము వివర్ణం చెందింది. నీరసించివున్న శ్యామలుడు తలదిమ్మపట్టి ఫెళ్ళున విరుచుకొని పడిపోయాడు. " నాయనా!" అంటూ కొడుకును రెండుచేతులతో యెత్తి మంచంమీద పడుకోబెట్టి సుబ్బయ్యగారు

"ఏమే నీళ్ళ" అని కేక పెట్టాడు "ఏమిటండీ ! ఏమిటండీ !" అంటూ తల్లికంగారు పడుతూ వచ్చింది. మంచంమీద శవంలా పడివున్న కొడుకును చూచి "ఓయి నాయనో, అమ్మో" అని కేకలు పెట్టింది.

"నోరుమూసుకో ! నాడిప్రాణం కడగట్టింది. పరుగెత్తుకువెళ్ళి డాక్టరుగారిని అర్జంటుగా రమ్మని కబురు పంపించు" అని సుబ్బయ్యగారు కొడుకు మొహంమీద నీళ్ళు గట్టిగచల్లి కుమారుడి నాడి పరిశీలిస్తూ ఆతని మొహంవంక పారచూచి కళ్ళు చెమరించ వల్ల పైమీద కండువాతో ఎడమచేత్తో కళ్ళు తుడుచుకున్నాడు.

౩

శ్యామలరావు కళ్ళు తెరిచాడు తల్లివంక మొహం తిప్పి "ఏమీలేదమ్మా ! కంగారు పడకు" అని లేవబోయాడు.

తండ్రి "నాయనా ! వద్దు" అని వారించి కుమారుని మంచంమీద పడుకోబెట్టాడు. ఇంతట్లో డాక్టరుగారు వొచ్చారు. శ్యామలుని పూర్తిగా పరీక్ష చేసి అతిబలహీనతవల్ల గుండెమాత్రం బలహీనంగా ఉందని శ్యామలుని నరాలను దెబ్బ తిగిలిందనీ పూర్తి విశ్రాంతి, జాగ్రతగ వైద్యంచేయటం ముఖ్యమనీ చెప్పి "గ్లూకోజు" మందు 'ఇంజెక్షను' ఇచ్చి ఇంటికి వెళ్ళి మందులు పంపిస్తానని వాళ్ళందరకు ధైర్యం చెప్పి వెళ్ళాడు.

శ్యామలరావు లేవలేడు. కాళ్ళూ చేతులు నల్లుకుపోయినవి. అధికాచమాన, అల్పాచమానాలు మంచంమీదనే. "నీరసం ! నీరసం ! కాఫీ" అని గంట గంటకూ నీరసస్వరంతో అడగటము ప్రారంభించాడు. ఆతని కేదో అపరిమితభయం ఉదయించింది మాట్లాడితే డాక్టర్ను పిలవమంటాడు. డాక్టరు ధైర్యం చెపుతూంటే ధైర్యంగా వుంటాడు.

ఒకసారతనికి వేగనాడి [Trachycordia] ఒకసారతనికి మంద నాడి [Bradycordia] ఏమిటీ ఈ ప్రాణానికింత కంగారూ? తాను పోషించిన స్వర్ణకుమారి ఇంకో అదృష్టవంతుని జీవితంలో భాగస్వామిని కాబోతూంటే భగవంతు డెంతో మంచిదారే చూపిస్తున్నాడు. బాధ లేకుండా జీవితం మాయమైపోతే ఆ బాలిక దారి నిష్కంటక మౌతుంది, తాను లోకంలోలేని భావం ఆమెకు తోచినప్పుడు తనకోసం ఒకసారైనా విచారించకుండా వుంటుందా? ఈ ప్రేమ కాశించటం తుచ్ఛమా! పురుషునికి స్త్రీమీదనూ స్త్రీకి పురుషునిమీదనూ వుండే ప్రేమే జీవితంలోకల్లా ఉత్కృష్టమైన ప్రేమ. ఆ ప్రేమ నిష్కల్మషమైతే భగవంతునిమీద ప్రేమే ఔతుంద ప్రేమ_ జీవితం భగ్నంచేసి పెట్టుకోవటానికి తెచ్చిపెట్టుకున్న విషం! బంగారపు గిన్నెలో నింపుకొని తాను తాగుతున్నాడు—వ్యవసాయం—కళలు ప్రేమ—

డాక్టరుకి శ్యామలరావు సంగతి చూస్తే కొంచెం భయమే వేసింది. మద్రాసో, విశాఖపట్టణమో తీసుకెళ్ళితే ఉత్తమమని సుబ్బయ్యగారికి సలహా చెప్పాడు. తానుగూడా వస్తానన్నాడు. సుబ్బయ్యగారు కొడుకుతో నెమ్మదిగ " నాన్నా! విశాఖపట్టణం వెళ్దాంరా " అన్నాడు.

నీరస కంఠస్వరంతో శ్యామలుడు "ఏమీ జబ్బులేదండీ! రెండు రోజుల్లో నెమ్మదిస్తుంది. " అని అన్నాడు. కుమారుని కంఠంలోని నిస్పృహా, హృదయంలోని బాధా, సుబ్బయ్యగారు కనిపెట్టకపోలేదు.

" నాన్నా నీ కిష్టంవచ్చినపని చేసుకో! నీకు కావలసిన ఇస్తాను, బెంగపెట్టుకోకు. అనవసరమైన హృదయంలోని బాధ నిన్ను క్రుంగదీయుట మటుకుండకగా కడుపునపుట్టిన నీవొక్కడిమీదా ఆధారపడివున్న నన్నూ,

మీ అమ్మనీ, మహాబాధా నరకకూపాల్లోపడద్రోస్తుంది. నా జన్మంతా నీ మీదే ఆధారపడివున్నది. ధైర్యం తెచ్చుకొని నన్ను రక్షించుకో! ”

తన హృదయంలోని బాధతోపాటు, తండ్రిగారి బాధకూడ శ్యామసుందరునకు జబ్బును ఇబ్బడి చేసింది.

ఆనాడు అతి ఆవేశంతో సుబ్బయ్యగారు పెద్ద వుత్తరం వ్రాసి రాధాకృష్ణయ్యగారికి బెజవాడ పంపించారు.

## ౮

వెళ్ళిన దగ్గరనుంచీ అన్నగారిదగ్గరనుండి వుత్తరాలే లేవని స్వర్ణకుమారి ఆలోచించుకుంటూ ఒక ఇంగ్లీషు నవల చదువుకొంటోంది. రాధాకృష్ణయ్యగారు కూతురు దగ్గరకు వచ్చి “స్వర్ణా! మీ చదువులన్నీ మా పెద్దవాళ్ళ ప్రాణాంతకాలైనాయి” అని అన్నారు

“ ఏమిటండీ నాన్నగారూ! మీరుగూడ మాచదువులమీదే కత్తికట్టారా! నేను చదువుకుంటానని ముచ్చట పడితే మీకు చెప్పించమని యెక్కడవుంది ? ”

“ ఔను నానెత్తిమీదకుండ నేనే బోర్లించుకొన్నానులే.”

“ అలా మాటాడుతూన్నా రేమిటండీ, నాన్నగారూ!”

“ ఏమీలేదు; ఇందుపల్లినుంచి వుత్తరం శొచ్చింది. ”

స్వర్ణకుమారి మౌనము.

“ నాకేమి చేయాలో తోచకుండా వున్నది ”

" ఉత్తరం ఏమని వొచ్చిందండీ! "

" శ్యామలరావు తండ్రి సుబ్బయ్యగారు వ్రాశారు. "

స్వర్ణకుమారి తలవంచుకొని కాలి బొటనవేలుతో నేల రాస్తూన్నది,

" శ్యామలునికి చాల జబ్బుగ వుందిట!"

" ఏమిటండీ!"

" కుంతలూరునుంచి వొచ్చినప్పటినుంచీ శ్యామలరావు వ్యవసాయం ప్రారంభించాట్ట! చిక్కి శల్యమైపోయాట్ట. తండ్రి ఎంత చెప్పినా వినలేదట. నేను వెనక సుబ్బయ్యగారికి నువ్వు సుబ్రహ్మణ్యాన్ని పెళ్ళిచేసుకుండేవిషయం వుత్తరం వ్రాశాను. ఆ సంగతి ఇన్నాళ్ళదాకా కొడుకుతో చెప్పకుండ మూడురోజులక్రిందట తండ్రి శ్యామలరావుతో చెప్పాట్ట. ఆవార్త వినటంతోనే శ్యామలుడు విరుచుకుపడి పోయాట్ట—"

" ఏలా వుందండీ! "

" డాక్టరు వైద్యం చేస్తున్నాడట! విశాఖపట్టణం తీసుకువెడదామని అనుకుంటూన్నారట. మీ యిద్దరి చిన్నతనంలో నే నిచ్చినమాట జ్ఞాపకం చేసుకోవలసిందని సుబ్బయ్యగారు వ్రాశారు—"

" నాన్నా మీరు కారుమాటాడించి ఇందుపల్లిపరియాణం కండి. అమ్మా మీరూ, నేనూ తత్ క్షణం బయలుదేరి వెళ్ళాలి. అన్నయ్యకీ శ్యామరావుకీ స్నేహితుడు ఈవూళ్లో డాక్టరు జగన్నాధరావుగారున్నారే ఆయన్నికూడ తీసుకువెడదాం. అన్నయ్యని తత్ క్షణం రమ్మని వుత్తరం వ్రాసి ఇందుపల్లినుంచి వొచ్చిన వుత్తరం జతపర్చి మనిషికిచ్చి పంపండి " అని కన్నీళ్ళతో కంగారుతో బట్టలు సర్దుకొంటోంది. రాధాకృష్ణయ్యగారు విస విస వెళ్ళిపోయారు.

స్వర్ణకుమారి హృదయంలో "కాశీవిశ్వేశ్వరా! నీ సాక్షిగా మేమిద్దరం ప్రేమప్రతిజ్ఞ తీసుకున్నాము. నా శ్యామలుని రక్షించు. మేమిద్దరం కలిసి నీదగ్గరకు వస్తాము. తండ్రీ!" అని ఏడ్చినది. ఆమె కన్నులూ ఏడ్చినవి.

౨౪

ఏదో నల్లని మత్తుకలలతో, మండే బాధతో ఈతకందని లోతులు గల నీరసంతో "అమ్మా" అంటూ ఓమాటు తల్లిని కాళ్ళు పిసకమంటాడు. ఓమాటు వొద్దంటాడు శ్యామం.

శ్యామలుడు ఆ అతినీరసములోనే ఏదో కారు చప్పుడు విన్నాడు. ఇంతటిలో డాక్టరుగారు వొస్తున్నారని సుబ్బయ్యగారు వచ్చి కొడుకుతో చెప్పాడు.

"స...రే...లెండీ..." అని శ్యామలుడు కళ్ళు తెరిచాడు.

డాక్టరు విశ్వనాథంగారు డాక్టరు జగన్నాథరావుతో గది గుమ్మం వద్ద ప్రత్యక్షమయ్యాడు. జగన్నాథరావు గదిగుమ్మంనుండి లోపలికి గబగబ వచ్చి "ఏమిరా, శ్యామ్! మహా మొనగాడ వయ్యావుట! నీ స్నేహం యేడ్చినట్టేవుంది. కాస్త కబురు పంపకూడదు కాబోలు? ఏదీ చెయ్యేది?"

జగన్నాథరావు చిన్నతనంలోనే ప్రసిద్ధి సంపాదించుకున్న డాక్టరు. శ్యామలునికన్న నాలుగేళ్ళు పెద్ద. శ్యామలునిగుండె బాగా పరీక్షచేశాడు. రక్తపుపోటు యంత్రంతో ముంజేతినాడి పరీక్ష చేశాడు.

"గుండెలో జబ్బేమీ లేదు. నరనీరసత్వమూ బెంగా తప్ప ఏమీ లేదు. పదిరోజులు పాటు నాదగ్గరవుండటము నాతో సినిమాలకు రావడము

నేనివ్వాళ నాతో తీసుకువచ్చిన మంచి నర్సుచేతుల్లో ఉపచారం పొంద టమ్ము, ఇదీ వీడికి వైద్యము. ఒరే శ్యామ్! ఈ నర్సుని చూశావూ! చాలా ప్రజ్ఞావంతురాలు. నువ్వెరుగున్నమ్మా రయేట జనరల్ ఆస్పటలులో నర్సుల చేతిలో ఎప్పుడూ పడలేదు కాబోలు? "

శ్యామలుడు ఆనందము, బాధ సమ్మిళిత మయ్యే నవ్వుతో, స్నేహితుని అరచెయ్యి తన ముఖానికి అద్దుకున్నాడు.

" ఒరే శ్యామ్! మా నర్సు చాల అందమైనదిసుమా! జాగ్రత్తగావుండు లేకపోతే నాకు ఈర్ష్యవొస్తుందిసుమా. "

" నీ మొహం! ఎప్పుడూ ఇలాంటిమాటలే " అని నవ్వుతూ అన్నాడు శ్యామలుడు. ఆ నీరసత్వంలో బలం కలుగుతున్న ఛాయలూ వున్నవి.

" నువ్వు కంగారుపడకపోతే ఆ అమ్మాయి ఎవ్వరో చెప్తాను "

" నాకు నర్సెందుకురా! " మాట యింకాదుబవుగా వున్నది.

" ఈ గోజుల్లో జబ్బులకి నర్సులు లేకపోతే లాభంలేదు. అంచేత ఆ నర్సుపేరు చెప్తున్నాను. ఆమె పేరు బంగారం! "

శ్యామసుందరుని కళ్ళు మెరసినవి. ఆతని గుండె దడ దడ కొట్టుకున్నది. శ్యామసుందరుని చేయి తనచేతితో పట్టుకుని నాడిపై వ్రేళ్ళు యింతవరకూ వుంచివున్న జగన్నాధరావు,

" ఒరే! నాడి ఎంతవేగంగా కొట్టుకొంటోందో. తగ్గు తగ్గు, అబ్బా! ఏమి సంతోషమండీ. మావాడికి బంగారునగలు చూట్టం, బంగారురంగులు చూట్టం, మాయిష్టం. ఈ నర్సు పేరు వొట్టి బంగారు కాదురోయి, బంగారపు కొమాక్తె, స్వర్ణకుమారీదేవి. సుబ్బయ్యగారూ! ఆ నర్సునిలా పిలవండీ!"

గుమ్మంబైటనుండీ ఈ మాటలన్నీ వింటూన్న స్వర్ణకుమారి చిరునవ్వు నవ్వు కుంటూ గదిలోనికి వొచ్చింది. స్వర్ణకుమారి చూపులూ, శ్యామసుందరుని చూపులూ జగత్స్వరమూ మరిచి ఒక దానిలో ఒకటి లీనమైపోయాయి.

"మానర్సుని చూస్తే నే నాడి బాగా ఇంప్రూవైందే; ఆవిడ పరిచర్య చేస్తే రేపే లేచి నడుస్తాడు. నీ డ్యూటీలో చేరమ్మా, నర్సూ!"

ఇంతట్లో రాధాకృష్ణయ్యగారు, స్వర్ణకుమారి తల్లి మహాలక్ష్మమ్మగారూ, లోపలికి వొచ్చారు

రాధాకృష్ణయ్యగారు, "ఏమోయ్ శ్యామం! జగన్నాధరావు రేపు పొద్దున్నే మనమంతా బెజవాడ వెళ్ళాలని దారిలో చెప్పాడు. నీ వెనకటి మిసిమితనం వొచ్చేవరకూ మా యింటిలో వుండాలిసుమా! తర్వాత నీ యిష్టం. ముహూర్తానికి తరలివచ్చేవరకూ మాయింటికి వచ్చినా సరే, లేకపోయినాసరే!"

ఆ రాత్రికి శ్రీనివాసరావు వచ్చాడు. శ్రీనివాసరావు, జగన్నాధరావు, శ్యామలరావు ఉత్తమ స్నేహానందంలో తరంగాలులా పైకుబికారు. సుబ్రహ్మణ్యానికి మాట యివ్వలేదని వారందరితో చెప్పాడు శ్రీనివాసరావు. ఈ ఆనందంలో నీరసంమాట మరచిపోయి శ్యామలరావు కూర్చునే మాట్లాడుతూన్నాడు. స్వర్ణ దివ్యదేవతలా పడుకోమంటూ శ్యామలుని కేకలువేస్తూ అతని ఫాలంపై హస్తతలంవేస్తూ తన నర్సుపని బాగా చేస్తూన్నది.

మర్నాడు ఉదయం శ్యామలరావు గదిలోనికి నవ్వుతూ అతనినర్సు కాఫీ మందూ పట్టుకువొచ్చింది.

"శ్యామ్! మందుపుచ్చుకొని, కాఫీపుచ్చుకో"

"నువ్వు రావటమే మందు."

" పొద్దున్నే అన్నయ్య నువ్వు వేసినతోట చూసివొచ్చాడు. నాకో సమే ఆతోట విశాఖ! నీ ప్రేమంతా ఆతోటలో నే అన్నయ్యకు కనపడిందట. నీ ప్రేమకు నేను పాత్రురాల నౌతానా శ్యామ్. "

" ఇలారా సొన్నసానీ! నాగుండెలు ఎలాంటిరాగాలు పాడుతూన్నాయో విందుగానీ. స్టెథస్కోపుతో కాదు! నీ చెవితోనే విను." ప్రఫుల్లమైన కన్నులతో, మోముతో ఆమె ఆతని కౌగిలిలో చేరింది.

" మనం ఇద్దరం కాశీ వెళ్ళాలి, నేను మొక్కుకున్నా. "

" ఆత్మేశ్వరీ ! సొన్నసాని ! నా సొన్నసానీ ! కాశీకే కాదు. సర్వ దివ్యక్షేత్రాలకు నీతో యాత్రలు సలుపుతాను. ఇది కలేఅనుకుంటున్నాను"

" కలా , కళా ? "

" సోన్! నిన్ను వదలి ఎల్లా ఉండగలుగుతున్నానో. "

" మనం బెజవాడలో లలితకళాశాల ఎప్పుడు ప్రారంభించడం "?

"వ్యవసాయంలోని అందం రంగరిస్తూ త్వరలోనే "

శ్యామసుందరుడు ఆమె చెంపలు పట్టి కళ్ళల్లోకి చూసి ఆమెఫాలం ముద్దుపెట్టుకున్నాడు



# పాడు దేవాలయం

## ౧

ఆ ముసలితాత రోజూ ఊళ్ళోకి ముష్టికివచ్చేవాడు. ఎక్కణ్నుంచి వస్తున్నాడో ఎవళ్ళకి తెలియలే. పాట పాడడు "బిచ్చం వేయమ్మా" అనన్నా అనడు. ఏమీ మాట్లాడకుండా గుమ్మందగ్గిర నిలబడ్తాడు. పొమ్మంటే పోతాడు. పొమ్మన్నదాకా నవ్వైనా లేకుండా ఆ గుమ్మందగ్గిరే నుంచుంటాడు. ఊరంతా అడుక్కొని సాయింత్రిందాకా మావూళ్లో చెరువు గట్టుమీద కూర్చుంటాడు. ఎప్పుడైనా యిటు అటూ కదుల్తాడేమోగాని సాధారణంగా ఎల్లాకూచుంటాడో అలాగే వుంటాడు. ఆతనిగడ్డం మొ[illegible] జొన్నకండెపేచులా తెల్లగా నెరిసిపోయింది. చిరిగిన పేలికలు కట్టుకున్నా అవి శుభ్రంగా వుంటాయి.

ఆతగాడి కళ్ళు మాత్రం ఆ తాత అంటే [illegible] ప్రేమపుట్టుతుంది. వాట్లో ఎంతో ఆపేక్షలు తొంగిచూకూ వుంటాయి. ఆ తాత వుండగా బాధపడుతూన్న జంతువేదైనా కనబడితే లేచి తన పంచిలో నుంచి ఏవోవో గచ్చాకుపచ్చాకు తీసి కట్లు కడ్తాడు. ఆతను కట్లుకట్టిన జంతువులన్నీ రోగంపోయి ఆరోగ్యంగా వున్నాయన్నమాటే. చెరువుగట్టు మీద ఆ తాత కూచున్నప్పుడే రోగాలతో బాధపడుతున్న పశువుల తోలుకని అక్కడకు చుట్టుపక్కల వూళ్ళవాళ్ళంతా వచ్చేవారు.

•

తిండిలేక మాడిపోయే అనేకమంది బీదవాళ్ళకి ఆతాత కుంచాలకొద్దీ బియ్యం ఇవ్వడం మేం ఎరుగుదుం.

తన బియ్యం ఎక్కడదాస్తాడో ఎక్కడపడుకుంటాడో వంటచేసే వాళ్ళు ఎవరైనా వున్నారో ఎవళ్ళకీ తెలవదు.

౨

ఒక రోజున నేనూ నా స్నేహితుడూ బయలుదేరి మావూరుకు దక్షిణంగావున్న అడవిలోకి పోయాం, ఆ అడవిలో ఒక పాడుదేవాలయం వుందని నాకు తెలుసును. ముళ్ళడొంకలు పల్లేరు చిట్టడవి దాటి గుడిలో పడ్డాం. అక్కడ అన్నీ ఇటికెలే ఉట్టిగోడలు మధ్య అసలుగుడితప్ప ఇంకేమీ లేదు. నాలుగైదు విగ్రహాలుంటే అవన్నీ మావూళ్ళో కొత్తగా కట్టించిన గుళ్ళోకి తీసికెళ్ళారు కాని ఇంకా అక్కడ ఎన్నో రాళ్ళస్థంభాలు శాసనాలు చెక్కిన రాళ్ళు వున్నాయి. విరిగిపోయిన విగ్రహాలు చెక్కడాలు చాలావున్నాయి. అందుకనే పురాతన శిల్ప పరిశోధక సంఘమువారు "ఇక్కడుండే వస్తువులు ఒక్కటీ ముట్టుకో కూడదని" గవర్నమెంటువుత్తరువు ఒక బల్లమీద రాయించి అక్కడ పాతేయిచారు. ఆగుడి చాలా పెద్దది. ఆ చిత్రాలన్నీ చూపిస్తో నాకు తెలిసిన ఆ పాడు దేవాలయగాథ లేవేవిటో మా స్నేహితుడికి చెప్తూంటే సాయంత్రమైంది.

సప్తమినాటి చంద్రుడు బాగా కాంతులు చిమ్మాడు. ఆ వెన్నెల్లో ఆ పాడుదేవాలయం మాకు చాలా అందంగా కనబడింది.

3

ఇంతల్లో ఒకగంట వినబడింది. ఇద్దరం హడలిపోయాము. ఆ అడివిలో ఖంగు ఖంగుమని గంటెక్కణ్ణుంచి వచ్చింది. ఎద్దులగంటేమో అని అనుకుని దేవతలు దెయ్యాలు జ్ఞాపకంవచ్చి ఇఖ యిక్కడ వుండకూడదని అనుకుంటూ ఆగోడలన్నీ దాటి బయటపడ్డాం. ఇంటికి వెడదామని దారి పట్టాం. చటుక్కున మళ్ళీ వినపించిదయ్యా ఆ గంట! ఈపట్టు గళ్ళోంచే స్పష్టంగా మాకు వినుపించింది. ఒకళ్ళ మొఖాలు ఒకళ్ళు చూసుకొన్నాం. తప్పకుండా ఇది ఏవిటో—అనే అనుకున్నాం.

గబ గబ దారిలోకివచ్చి నిలిచాం. అయినా ఆస్థలం వదల్లేక అక్కడే నిల్చొని చెవియిచ్చివినడం ఆరంభించాం, మాకు మంచిస్థాయిలో పాటలు వినిపించడం ప్రారంభించాయి. ఏమయితే అయింది. ఇంగ్లీషు చదువుకున్నాం మా నిఘంటువుల్లో పిశాచాలు లేవు మనకిమాత్రం భయం ఎందుకురా! తెల్లవాడైతే భయపడ్తాడా? పదంటే పదనుకొని ఇటూ అటూ చూస్తూ నెమ్మదిగా ఆ పాడుగుళ్లో ప్రవేశించాం. గర్భగుడి ముందరికివెళ్ళాం. అక్కడ మాకు నీడల పంపిస్తూ అఖండంలాంటి దీపం కనబడింది. ఇది కొరివిదెయ్యం కాదుగదా అనిపించింది.

గర్భగుడి మొదటి గుమ్మందాటేటప్పటికి పూర్వ విగ్రహంవుండే పీఠాని కెదురుగుండా పూజచేస్తూ ఒక మనుష్యరూపం కనిపించింది లోపలి గుమ్మందాటి వెళ్ళాం

అక్కడ మాకు కలిగిన ఆశ్చర్యం ఏవిటంటే; మా వూళ్లో ముష్టెత్తుకొనే ముసలితాతే అక్కడ పూజ చేస్తున్నాడు. స్పష్టంగా ఏవీ శబ్దస్వ

రదోషాలు లేకుండా సంస్కృత మంత్రాలు మహా ప్రవాహంలా ఉచ్చరిస్తు న్నాడు. స్తంభాల్లా అలాగే నిలబడ్డాం ఇద్దరమూ. ఆ విగహంలేని ఆపీఠా నికే పువ్వులతో పూజ చేశాడు. హారతి ఇచ్చాడు, నైవేద్యం పెట్టాడు.

౪

అందాకా అలాగే నిలబడ్డ మమ్మల్ని చూసి లేవగానే మాకాపువ్వులు ఇచ్చాడు. తలవంచుకొని ఆ ప్రసాదం శిరస్సుమీద వుంచుకున్నాం.

నేను : ఎవరునువ్వు. ఇక్కడేనా ఏమిటి నువ్వువుండటం. ముసలి తాత మాట్లాడలేదు.

నా స్నేహితుడు : అయ్యా ఎన్నాళ్ళనుంచి పూజ చేస్తున్నారండి మీరు.

ఆ ముసలిభక్తుడు బ్రాహ్మణుడని కనిపెట్టాడు మావాడు.

మా యిద్దరికేసి ఒక పదినిముషాలు చూసాడా తాత.

ఆ చూపుల్లో ఏమీ కోపంలేదు.

ఇద్దరం ఎందుకో ఆయనకి నమస్కారాలు చేసాం.

కూర్చోమని సైగచేసి మేంకూచున్న తరువాత అక్కడే పద్మాసనం వేసి కూచున్నాడు మా ముసలితాత.

"నా పూర్వీకులు ఈ దేవాలయానికి పూజార్లు. ఎన్ని శతాబ్దాల నుంచి మాకుటుంబం తరతరంగా ఈదేవుడికి నిత్యనైవేద్యాది పూజలు చేస్తోందో నాకు తెలవదు. చెడుకాలమున ఈగుడి పాడైపోయింది. ఈ గుడి చుట్టూ ఒక పెద్దపట్టణం వుండేది. ఆ సంగతి మీకు తెలుసుననుకుంటా?

ఆ పట్నం దానికితోడుగా ఈగుడీ పాడైపోయిన తర్వాత మా పూర్వీకుల కుటుంబం ఈ సమీపాన్నే ఒక పూరిల్లు వేసుకొన్ని దేవుడికి నైవేద్యాలు, పూజలు నిత్యంగా జరుపుతోండేవారు. చుట్టుపక్కల వూళ్ళవాళ్ళు ఏడాదికొకమాటు ఇక్కడ ఒక తిరునాళ్ళ వుత్సవం చేసేవారు. అల్లా నాలుగైదు తరాలు పోయేటప్పటికి నిమ్మదిగా అ తిరునాళ్ళు మాయమయ్యాయి...... మా పూర్వీకుల కుటుంబం ఇక్కణ్ణుంచిపోయి ఇక్కడి పదిమైళ్ళలోవున్న......గ్రామం వెళ్ళారు. నువ్వొకుగుదువా వూరు. కాని వారు పతిఏకాదశికి వచ్చి ఇక్కడ పూజలు చేసేవారు. రాను రాను మాముత్తాత గారి కాలంవచ్చేటప్పటికి ఆయన కుటుంబంతో ఏడాదికి వకసారి ఆ తిరునాళ్ళరోజులకిమాత్రంఇక్కడకువచ్చి మూడురోలులు పూజలుచేసేవెళ్ళిపోయేవాడు. అల్లాగే మాతాతగారు మా నాన్నగారు విధికృతంగా పూజలు చేసేవాళ్ళు.

“ నేను బియే చదువుతూండగా నా తండ్రిగారు పోయారు. చచ్చిపోయేటప్పుడు నన్ను పిలిచి ఏదో చెప్పాలని అనేకమాట్లుకొని మళ్ళీ మానేస్తూ చివరకు ప్రాణంపోయే సమయంలో నన్ను దగ్గరకు పిలిచి అస్పష్టంగా నాలుగుమాటలాడి ప్రాణం వదిలాడు.

“ నేను గుడిమాటే మరిచా. ఏభైఐదేళ్ళదాకా గవర్నమెంటు వుద్యోగాలు చేసా. చివరకు డిప్యూటికలెక్టరు పనిచేస్తూ పింషను పుచ్చుకొన్నా. ఆ వుద్యోగాలు చేసే రోజుల్లో అ తిరునాళ్ళ రోజుల్లో నైద్యులు చెప్పుకోలేని రోగం వచ్చేది పెన్షను పుచ్చుకొని మావూరు వచ్చాను. పూజలు పునస్కారాలు ఎన్ని చేసినా, ఎన్ని తీర్థయాత్రలుసలిపినా నాకు ఒక

విచిత్రమైన మనో చాంచల్యము కలిగింది. మా చుట్టాలు మతి పోతుందనుకున్నారు.

"ఇప్పటికి నాలుగేళ్ళకిందటను మా కిక్కడవున్న దేవాలయంబాపతు వచ్చిన పొలాలు చూడడానికి ఈవూరు వచ్చాను। ఆ సమయంలో ఈగుడి చూశాను

"పల్లో అడుగుపెట్టగానో లేదో ఏదో రాయితగిలి కళ్ళుతిరిగి పడిపోయాను. అప్పుడు ఏమి చెప్పను! ఈగుడి అంతా కల కలలాడిపోయింది. అన్ని వెండి దీపస్తంభాలలో ఆవు నేయిదీపాలు, గంటలు ధూపాలు. బంగారువిగ్రహాలు కనబడ్డాయి "వత్సా—ఎన్నివత్సరాలు పూజలు లేక వుంచినయ్యా" అని స్పష్టముగా వినబడ్డాయి మాటలు!

"అప్పటినుంచి నా ఆస్తి దానధర్మాదులు చేసాను కొంత నా దూరపుచుట్టాలకు ఇచ్చాను. నా కుమారుడు చెన్నపట్నంలో చదువుతున్నాడు. అతనికి కొంత ఆస్తి ఇచ్చాను ఇక్కడకువచ్చి ఈవిధంగా వుంటున్నా!"

ఆ వృద్ధుడు మానివేశాడు. మేం బయటకువచ్చాం మా ఆత్మలు అద్భుతానందంలో నిండాయి! దేశమంతా వెన్నెల నిండింది.



# సూర్యసుత

## ౧

ఆనాడు నేను త్రివేణీసంగమం కడకుపోయినాను. యమునానదీ నీల ప్రవాహాలలో ఈదులాడే పెద్ద పెద్ద తాంబేళ్ళు పడవల్లోనుండి యాత్రికులు జల్లు మరమరాలను గబుకు గబుక్కున మింగివేస్తూ నీటిక్రింది ముత్యాల బుడగలలో మాయమవుతున్నవి. ఎన్ని యుగాలనుండి ఈ కూర్మాలు యమునాజలాల విహరిస్తున్నవో ఆనదీమతల్లికి కూర్మవాహిని అని పేరువచ్చింది. తెల్లని నుడిగుండాల గంగాప్రవాహం, నీలస్రవంతీరమణీమణిని కౌగిలించుకొనే ప్రదేశానికి మాపడవ వచ్చింది. నేను మంచి ఈతగాణ్ణి. పడవ యమునా కృష్ణగభీరాలపై పోతున్నప్పుడే తటాలున నీటిలోకి ఉరికి మునిగి లోతులకు దిగిపోయాను. నీలమణుల కాంతి స్వచ్ఛగగనాంశుజాలము నన్ను పొదిగివైచినట్లయింది. మందగజయానములగు కచ్ఛపాలు ఇటునటు నన్ను చూచికొనిపోయినవి. ఆనిర్మల శీతలజల ప్రదేశాలలో చిన్నిపాపలా చిట్టిమీనంలా చేతులాడిస్తూ కాళ్ళుకదుపుతూ విహరించాను.

నీటిలోపలి లోతులలో ముందు కొంతదూరము సాగిపోయేసరికి శ్వేతరేఖాపుంఖాలు అతివడిగా నావైపునకు చొచ్చుకొని వచ్చుచున్నట్లయింది. నేను భ్రమించి నిస్తబ్ధుడనై చేతనముడిగి ఆగిపోయినాను. ఆవడుల్లో నేను వానాలపై గిర గిర తిరుగ నారంభించాను. భయముచే ఊపిరాడక ఒక్కనిమేషమాత్రం తన్నుకొని జలప్రవాహం పైకివచ్చా. పడవలోని నా

స్నేహితులు "అబ్బా, ఏమిరా! నువ్వింక కనపడవే అనుకున్నాము ఒక నిముషంపైగా నీటిలో వున్నావే!" అని అన్నారు. నావదగ్గిరకువచ్చింది. అంచుపట్టుకొని నావతోపాటు గంగానదీ యమునాధునీ కలిసే ప్రదేశం లోనికి వచ్చాను. గంగానది లోతులేదు, యమునలోతు. యాత్రికులు స్నానమొనరించే వీలుకోసం పురపాలకసంఘంవారు ఆ ప్రదేశాల నదికి చాలా లోపలి భాగంవరకూ కఱ్ఱలపాతి వానిపై పలకలనుబిగించి నీటిపైనే దారి యేర్పరిచినారు. ఒక పురోహితుడు "త్రివేణిసంగమస్నానే సకలపాప పరిహారార్థం గంగా యమునా సరస్వతీ సంగమస్నానం కరిష్యే" అని మంత్రాలు చదువుతుండగా మేమందరం స్నానాలుచేసి పవిత్రులమయ్యాము



త్రివేణీసంగమచిత్రం నామనస్సు కలచివైచినది. మరునాడు సాయంసమయాన మరల పోయి అంతర్వాహినియగు సరస్వతీ నదీమతల్లిని దర్శించుదాముగాక అని నీటిలోనికి ఉరికినాను. అపఃత్రి ప్రదేశమంతా వెదకినాను. ఊపిరాడక బయటకు వస్తూ మళ్ళా మునుగుతూ బంగారవర్ణ మెరసికొనిపోవు ప్రవాహమాల ఆ నీలిసుడుల్లో ఏ తెలివడుల్లో ఎక్కడైనా ప్రత్యక్షం అగునాయని ఈదులాడినాను. విసిగివేసారి ఒక్కయామం ప్రయత్నించి సంగమస్థానం కఱ్ఱలకడ తేలినాను. తలనుండి ప్రవహించే కాలువల్ని వేళ్ళతో తుడిచికొంటూ, నీటిపొరలు కమ్మినకనుల మిటుకరిస్తూ ఎదుటచూస్తే, ఎవ్వరూ లేని ఆ ప్రదేశాన అప్రవాహాన ఈదుతూ ఒక బాలిక కానవచ్చింది.

కన్నుల తుడిచికొని మరల చూచా నల్లని పట్టుకుచ్చుల వేణీభరం యమునానీలజల ప్రవాహాల ఒరిసికొని కలసిపోవగా మిరుమిట్లు కొలుపే బంగారంతీగ చేతులతో నీటిని వెనుకకు తోసుకొంటూ, నవ్వుమొగంతో ఆమె ఆనీట తేలుతూన్నది. ఇటూ అటూ ఏదైన పడవ ఉందా అని చూచాను. నావలుగాని తీరాలబండిగాని, ఇతరమనుష్యుల దర్శనంగాని నాకు కనుమాపుమేర ఏవైపునా కనబడలేదు. కొంచెము ఆశ్చర్యం పొందాను. కోటసంగతి జ్ఞప్తికివచ్చింది. అలహాబాదుకోటలో ఆంగ్లేయ కుటుంబాలు అనేకం ఉన్నవి. ఆంగ్లేయబాలిక ఎవరో ఈదులాడుతున్నది కాబోలు అనుకొని, మన దేశస్త్రీలట్టి సంతోషాలకు పెట్టిపుట్టుకదా అని నిట్టూర్పుపుచ్చి, ఆశ్చర్యహృదయాన ఆ బాలికనే చూస్తూ నీటిలో నిలిచిఉన్నాను.

ఇంతట్లో ఆమె నన్ను తనకడకురమ్మని సైగచేసింది. హృదయం దడ దడమంది. అదియేమిటనీ! నన్నుకాదు, నా వెనుక ఎవ్వరైనా ఉన్నారేమో అని వెనుక్కు చూచా. ఒక్కరిజాడ లేదు. మళ్ళి ఆమెవైపే చూశా. ఆమె స్పష్టంగా నావైపు చేయి విసరింది. ఆసాయం సమయాన ఆ ప్రవాహాల బంగారు సూర్యకిరణాలు ఆమె బాహువుల తళుకులకు ఎంత మాత్రం తులతూగలేవు. కొంచెము భయపడుతూనే బారయీతలో మకరంలా ఆమెకడను పోయినాను.

ఆమె ఆంగ్లబాలిక కాదు. చెవులకు కాంతులమెరయు వజ్రాల కర్ణాభరణములున్నాయి. మనోజ్ఞమై మేఘాలమాటునుండి మేలమాడుతూనవ్వే. బాలభానుబింబంలా ఆమె ఫాలాన ముత్యాల పాపటబొట్టు వ్రేలాడుతోంది మెలికలలో, నీలితళుకులలో, వంపుల మృదువులలో ముంగురులు, నీలిచాయలలో కలుస్తూ చెట్లనీడల తిరుగాడే సూర్యకిరణంలా, బంగారుపట్టులా ఆమె

వెనకనే వేణీభరం ఆనీటిలో ఆమెచుట్టూ వ్యాపించి ఉంది. నీరు ప్రతిఫలించే సంధ్యాంశువులులా ఆమె కన్నులు నవ్వుతూ పక్ష్మాలమాటునుండి నన్ను చూచాయి.

ఈమె ఒక గొప్ప బ్రహ్మసమాజిక కుటుంబం బాలిక అనుకొన్నా! ఇంగ్లీషుభాషరాని బాలిక ఈత నేర్చుతుందా అని "ఎందుకుపిల్చినారండి?" అని ఆంగ్లంలో ప్రశ్నించాను" నాకు భాషలన్నీ వచ్చునండీ! మీ తెలుగు భాష చాలా తియ్యనైన భాష అందులోనే నాతో మాటాడవచ్చునులెండి" అని యామె అంది. నాకుకలిగిన ఆశ్చర్యానికి పరిమితేలేదు.

నేను—మీరెవరు? ఎందుకు నన్ను పిలుస్తా?

ఆమె—నువ్వు కంగారు పడకపోతే చెపుతా!

నేను—చాలా ధైర్యస్థుణ్ణే!

ఆమె— నేను సూర్యదేవుడి కూతుర్ని.

ఆ బాలిక నన్ను వేళాకోళాలు చేస్తోందికాబోలు అనుకొన్నాను. తెలుగువచ్చిన ఈ బాలికఎవరు? ఈ ప్రయాగలో నివసించడానికి కారణం ఏమిటి? అని నామనస్సు పరి పరివిధాలపోయింది.

ఆమె— నేను ఆంధ్రబాలికను కాదయ్యా! నువ్వు సరస్వతీనది ప్రవాహము చూడాలి అని వచ్చావు. నువ్వు చదువుకొన్నవాడవుకదా! సరస్వతీ ప్రవాహము కథలలో ఉందని. ఇక్కడ కనబడుతుందా ఎందుకయ్యా ఇంతవరదాకా ఒకటే నీటిలోతుల్లో ప్రాకులాడుతున్నావునువ్వు?

నా హృదయంలో ఏదియో ప్రతిధ్వనించిపోయింది, నా మనస్సులోని సంగతులీమె కెట్లా తెలిసినాయి? నాగుండె మహావేగంతో లోకాలు చరింప సాగినది.

నేను—మీరు చెప్పేసంగతులు నాకు అర్థంకావటంలేదండీ?

"నేను సూర్యుని పుత్రికను. యమున మాఅక్క! నేను రంగులమ్మాయిని. అప్పుడప్పుడు మా అక్క కెరటాలలో ఆడుకుంటూవుంటాను. నీవు నిజంగా అంతర్వాహినియగు సరస్వతే కనపడాలంటే నాతో రా!"

అని ఆమె నీటిలోనికి మునిగినది. ఆ నిర్మల నీరాలలో స్నిగ్ధమై, బంగారుచేపలా దిగంబరియై ఆ బాలిక స్వర్ణకాంతుల ఒరసికొనిపోతూ తన దేహంచుట్టూ వివిధవర్ణాల వెలిగొంగు వేణీఖర వీచికలు వ్యాపిస్తూఉండగా మునిగిపోయింది. నాచేయిపట్టుకొని తనవెంట లాగికొంటూ నీటిలోకి లోకి దిగిపోయింది. ఆమె హస్తతలం నా చేతిని పట్టగానే నా ఒళ్ళంతా విద్యుల్లతలు పాకిపోయినాయి. అత్యంతశీతలమైనట్లుగా, మహోష్ణ ప్రవాహమైనట్లుగా, శుభ్రమోహన గంధాలు అలమినట్లుగా ఆమె స్పర్శ నన్ను ఎంతో వివశత్వంతో ముంచింది. ఆలా ఆకర్షింపబడి ఆమె వెనుకే ఈదుకొంటూ నీటిలో మునిగిపోయినాను.

ఇరువురం ఈదుకొంటూ ఎన్నిలోతులకు పోయినామో? కొంతసేపటికి ఆమె భూమిపై నిలిచింది. నేనూ అప్పుడే ఆమెప్రక్క నిలిచాను. ఆమె నాసర్వస్వం లాగుకొని చిరునవ్వునవ్వి నా ఫాలము స్పృశించింది. నా ముఖాంచలాలనట్టు వేళ్ళతో స్పృశించి నా చుబుకం ఎత్తి "ఏమయ్యా రసపిపాసీ! నీ హృదయంలో సరస్వతీనదీ పరివాహాలు దర్శించాలని దివ్యకాంక్ష కలిగింది కాదూ! నేను సూర్యసుతను. ఆ సూర్యమండలమధ్యస్థ శిలలపారాల సర్వాగసాత్మకుడైన సూర్యదేవుడు అధివసించి ఉంటాడు. ఆనికి నేనూ మాయమునా ఉద్భవించాము. గంగ సూర్యసహోదరి, సరస్వతీ నదీమతల్లి సావిత్రీస్వరూపమైన సూర్యతనయ, గంగాయమునా సరస్వతీసంగమం కావ్యచిత్రగానసంగమమే! ఈ త్రివేణీసంగమ రహస్య జిజ్ఞాసువైన నీయందు

నా మనస్సు లగ్నమైంది. నీకు నేను ప్రత్యక్షమైనాను!" అని ఆ బాలిక కల కిల నవ్వింది.

నాకుఅంతా అగమ్యగోచరం అయింది. ఈ బాలిక ప్రత్యక్షం -వడం ఈ రోజులలో ఏలా సాధ్యం? అది కథలలోమాత్రం ఉన్నది.

"అనుమానం ఏందుకున్నావిగా?"

"ఇప్పటికే నాకు ఇదంతా మాయా! లేక ఊహలేక నేను నా ప్రాణాలు ధారకంగా వదిలివేస్తే నాకు నీదివ్యదర్శనం అయిందా? ఏమీ తెలియక ఈలా నిలుచుండిపోయాను!"

"ఓయి వెఱ్ఱివాడా నువ్వు కళాతపస్వివికావా?

"కళకోసం, కళావధికోసం కళాపరమార్థంకోసం ఎన్ని సంవత్సరాలనుండో మనస్సులో, భౌతిక జీవితంలో, హృదయంలో వెదుకుతున్నాను."

"అందుకునేకాదా! నేను నీ ఎదుట సాక్షాత్కరించింది, రాత్రి త్రివేణీసంగమ పవిత్ర దర్శనము చేతువుగాని!"

## 3

సూర్యసుతా! నువ్వు లలితకళాస్వరూపిణివి. నువ్వు కావ్యానందానివి. నీరూపమే గీతమై, నీ చూపులే నృత్యాకారమై నీ దేహలావణ్యమే మధురవర్ణాకృతులై, నీ కాకలీస్వనాలే ఛందస్సులై, నీవే భావమై, నీ శిల్పమే రసమై నాకు దర్శనం ఇచ్చింది.

ఓ సూర్యసుతా! ప్రణయదేవీ! ఈలా నాకీ త్రివేణీసంగమం దగ్గిర ఏలా ప్రత్యక్షమైనావు? నేను మనుష్యుణ్ణి, నువ్వు దేవవనితవు! నాకు కల

అయి ఉండవచ్చును. సరస్వనదీ దర్శనంచేసి, ఆ చీకట్లలో మేం ఇద్దరం పైకి తేలి ఈదులాడుతూ. ఆమెచే ఆజ్ఞాపితుడనై అలహాబాదులో మా మకాముకు వచ్చాను.

"ఎక్కడికివెళ్ళావురా?" "ఇంతసేపూ ఈతేనా!" "మతి ఉన్నదా!" అనే ప్రశ్నలు స్నేహితులు వర్షం కురిపించారు.

నా రహస్యం ఎవరికిచెప్పను? ఇంత చిన్నతనంలో నాకు మతిపోయిందనుకుంటారా? అప్పటికి కాలేజీలువిడిచిన కొత్తసంవత్సరాలు "బాపరాజును మదరాసు మోదివాకం ఆస్పత్రి లో చేర్పించిరా" అంటారా!

ఆమె వారికెందుకు ప్రత్యక్షం కాకూడదు? నాతో మాటలాడిన విషయాలు వారితో ఎందుకు వ్యక్తంచేయరాదు.

కాని ఆమెను కలుసుకొన్నాను! ఆ నీటిలోతుల్లో బంగారు వెలుగులు ప్రసరించిపోతూ ఉండగా, బంగారుపద్మాలు తన బంగారు వేణీభరంలో ధరించి తెల్లని హిమస్వచ్ఛ శరీరయై మకరవాహనయై, తెల్లని పద్మాలు అలంకరించుకొన్న జాహ్నవి కుడిచేత పట్టుకొని, నీలికలువలు నీలికుడలలో అలంకరించుకొని, నిర్మలనీలాకాశ సదృశశరీరయై, కూర్మవాహనయైన యమునా దేవిచేతిని ఎడమచేత పట్టుకొని నాకు ప్రత్యక్షమైన సరస్వతీ దేవి. ఆ త్రివేణీదర్శనము నిజముకాదా?

నాకా దర్శనంకాగానే ఆ నీటిలోతుల్లో ఆమెతో వారి ఎదుట మోకరించాను! వారు మమ్ము ఆశీర్వదించినారు. ఆ తర్వాత వారు ముగ్గురూ మాయమైనారు. మేము ఇరువురమూ పైకి తేలివచ్చినాము.

"ఓయి శిల్పీ, మేము దివ్యవనితలం, మాలో కొందరికి! మానవులపై ప్రణయవిలసనం కలుగుతుంది. నిన్ను నేను ప్రేమించినాను! ఇది విచిత్ర మని అనుకోక, కవివైన నీవు నా ప్రేమలోని నిజం తెలియదా రాజా!" అని ఆబాలిక అన్నది. అప్పుడు నేను.

"మర్త్యుడను నేనటే
అమరకాంతవు నువ్వటే
నీవునాకు పొందు ఎట్లా ?

కలల మునిగిన నేనటే
కలల మధ్యను నీవటే
నాకునీకూ చెలిమిఎట్లా ?

దైహికమ్మున నేనటే
దేహాన కావలను నీవటే
నీకునాకూ కౌగిలెట్లా"

అని నేను ఎవరో ఒక ఆశయకాంతను చంద్రికగా దూరాన నా స్వప్నాలదర్శించి నా చిన్నతనంలో గోదావరీ తీరాంగ్ల విద్యాశ్రమవాసినై పాడుకొన్నాను.

ఆపాట ఇప్పుడు మళ్ళీ పాడితే ఆ బాలిక విని నవ్వుతూ నాతో పాటు యమునాజలాల తేలియాడుతూనే పాడింది.

"ఒక తారకాకాంతి

ఒకదివ్యలిప్తలో
వీడి నేలకువచ్చె
ఆకాంతి పుంజమే
ఆనాడు రెండయ్యె
రెండు కిరణాలలో
ఒకటి నేనేనోయి
ఒకటి నువ్వోయీ!
నువ్వు మర్త్యుడవైతి
నేను దివిజను సుమ్మ
జన్మ జన్మాలుగా
తన్మయకళాపూజ
శిల్పిగా భిక్షుగా
కవివౌతు నటుడౌతు
పాటలో పదగతిలో
నన్నుగూర్చి పాడినావూ
నన్నుగూర్చి ఆడినావూ!
ఒకనా డజంతాను
ఒకనాడు ఆంధ్రపురి
ఒకనాడు బెన్వ్రోంటో
ఒకనాడు రోజెట్టి
నాబొమ్మలేవేసి
నన్ను శిల్పముచేసి

ఆగతచ్చావురా
ఆత్మనర్పించావు
వెదుకుతూ వెదుకుతూ
నిదర లేనీకలల
నన్ను గూర్చే పాడినావూ
నల్ను గూర్చే ఆడినావూ !
ఈ నాటికీజన్మ
ఈరూపు ఈ ప్రేమ !
ఈ త్రివేణిలో వచ్చినానూ
ఈవునే నే సుమ్మూ ఇచటా !"

అనిపాడి పక పక నవ్వింది,
ఈమాటన్నీ స్నేహితులకు ఏలా వర్ణించి చెప్పగలను.



నా ఈ యౌవనంలో నాలోని ఏదో శక్తి నన్ను పరవశుణ్ని చేస్తూ నా హృదయంలో రాగాలు పాడిస్తూ ఈలా ఈ త్రివేణీ సంగమంకడకు కొనివచ్చింది.

అక్కడ ఈ బాలిక నాకేలా ప్రత్యక్షమైనది. నమ్మనా, నమ్మగలనా ? నమ్మక ఏమిచేయను. ఆ బాలిక తన వేణిలో అలంకరించుకొనిన నీలికలవను నాకు ప్రేమతో తీసి ఇచ్చింది. ఆకలవపూవు పట్టుకునే యూబనకు

వచ్చాను. "అది ఎక్కడిదిరా ఇంత అందమైన నీలికలువ మన ఆంధ్ర దేశంలో లేదు" అన్నారు స్నేహితులు. ఆ పూవు నిజమే! ఆమె నిజంకాదా?

మేము ఇద్దరం ఆరాత్రి విడిపోయినప్పుడు పకపకనవ్వుతూ ఒక్కసారి నన్ను గాఢంగా పెన హృదయానిక అనుముకొని నాకనులమధ్యముద్దిడి నీటిలో ఉరికి మునిగిపోయింది.

ఆమరునాడు సాయంకాలం ఒక్కణ్ణే వెళ్ళినాను! ఆమె దర్శనమే లేదు. ఒక్కణ్ణే! అక్కడ ఆమెను "సూర్యసుతా! సూర్యసుతా!" అని పిలిచినాను.

ఏదో తీరని ఆవేదన. నేను చల్లగా మూర్ఛపోయానుకాబోలు.

నా స్నేహితులు నాకోసం వెదుకుకుంటూ వచ్చారు. నన్ను మూర్ఛలోనుంచి లేపడానికి ప్రయత్నించారు. నిష్ఫలంఅయి, వెంటనే బండిలో మకామునకు తీసుకువెళ్ళి ఒకవైద్యుణ్ణి తీసుకువచ్చారుట. ఆయన ప్రయత్నించి విసిగి వేసారి వెళ్ళిపోయాడు.

ఉదయం నాకు మెలకువవచ్చింది. బలహీనత లేదు. జ్వరంలేదు. ఒక స్నేహితుడు సూర్యసుత నాకిచ్చిన నల్లకలవను చూపిస్తూ "ఒరే! బాపన్నా!! ఎక్కడ సంపాదించావురా చెక్కుచెదరలేదిది" అన్నాడు.

నాగుండె మహావేగంతో మోగిపోయింది. బలవంతంగా నాస్నేహితులను ఆ పట్టణంలో నెలగోజులాపాను, ఆమె దర్శనమాత్రం సున్న.

త్రివేణీ సంగమంలో ఈదాను. నీటిలోతుల్లో ఊపిరాడనంతవరకూ నిలిచాను! ఆ దినాన గంటలు ఊపిరాడింది ఈ దినాన ఒకనిమేషమూ నీటిలో ఉండలేకపోతున్నాను.



మేమంతా తిరిగి మా ఊరు వచ్చివేశాము. నేను చిక్కిపోయినానట. నా కళ్ళు గుంటలు పట్టినవట. నా పెదవులలోని నవ్వులు ఇంకేడకో ఇంకిపోయినవంట !

నా ప్రేమ ! దేహసంబంధమైనది కాదు. అవును కూడా ! కామతృప్తి నేను వాంఛించినానా ? ఆ దివ్యబాలిక ఆ పరమసుందరి నా సూర్యసుత నా చిన్ననాటనుంచీ నా కలలలో నా ఎదుట దూరాన తోచే వెన్నెలలరాణి సౌందర్యరసాధిదేవి, తిరివేణీ కడ దర్శనమిచ్చి నాకు తన పరమ సౌందర్య రూపంతో ప్రత్యక్షమై ఆలా మాయమైన ఆ బాలిక దేహము నేనెలా వాంఛించను? ఆమె నిజముకాదన్న ఆమె నాకు నేడు సంకేతము చేసిన నీలి కలువ వాసన; పరిమళము వీడక నా మంజూషంలో దాగియున్నదేది?

గయాకాంగ్రెసును సభ్యునిగాపోయి తీర్థయాత్రసేవకుడనైన నాకీ పరమరహస్య సందర్శనమేమిటి ఈ ఆకేది నా జీవితమేమిటి?

అవును నా చిన్నతనానుంచి చంద్రకాంతిరూపిణియైన వెన్నెల బాలికను ప్రేమించాను. ఆమెకై పాటలు పాడాను. ఆమె నా హృదయంలో సౌందర్య పరమావధి. నా ఎదుట నేను దర్శించే బాలలు మామూలువారు. కొందరు ఎక్కువ అందాలవారు !

వట్టి దేహసౌందర్యమా మనుష్యుడు జీవితంలో వాంఛించేది ?

దేహసౌందర్యము మనుష్యుడు కోరతాడు. అతనికి ఆశయమైన దేహసౌందర్యము అతడు వాంఛిస్తాడు. కాని ఏదివ్య ముహూర్తంలోనో ఎవరో ఒకబాలిక, అతనికి సందర్శనమిస్తుంది. అతడు ప్రేమించని మునుపు

ఆతని హృదయాన, ఆతని స్వప్నాల ప్రత్యక్షమయ్యే బాలికను ఉన్న రూపంవేరు, ఈనాడు తన సర్వస్వమునూ అద్భుతమై మహాశక్తివంతమైన ఆ ప్రేమాకర్షణ చేసిన వ్యక్తిరూపం వేరు.

నాకలలలో ఉన్నవ్యక్తి మసక మసక చీకటివెనక ఉండేది. నేను త్రివేణీసంగమంకడ ప్రత్యక్షమైన ఆనగ్నబాలిక ఈనాడు సుస్పష్టమైన ఆనాటి తెరవెనక బాలికే!

ఎవరీ మూర్తి, సూర్యసుత అనే పేరు ఏమిటి? నేను వర్ణవిన్యాసలీలా యోగిని, ఆమె వర్ణవిన్యాస కళాధిదేవ! నేనా? నేను కంఠాన మధురాలు సాగపుల్కల పొందుతూ గీతికల పాడుకొనే యువకుడను, ఆమె సిద్ధబ్రహ్మ యైన సూర్యదేవుని అనుగు తనయ

సూర్యతనయవు నువ్వు దేవీ
సొబగులాడివి కాదె నీవు,
నీలోచనాలలో నీలిచూపులలోన
నిత్యభాసితమంట నిఖిలవర్ణాలటే సూర్య.
నీనవ్వులోవిరిసి నీమాటలోవెలసి
నిర్మలరసానంద నిరతిశయకావ్యాలు!"

మేము బాలకులం! ఒకకొత్తలోకం, ఒకకొత్తవేగం, ఒక కొత్తశక్తి ఎదుట. వెనక్కు వెళ్ళమనస్సు ఒప్పదు. ముందుకు సాగిపోవ ధైర్యంచాలదు. ఆముందులో త్రివేణి ఉన్నది. ఆ వెనకలో త్రివేణి ఉన్నది. నేడు నేనుదర్శించిన త్రివేణికి అర్థమున్నదా?

నదులుగా ప్రవహించే మా హృదయాలు నదములై పాశ్చాత్య దిశోన్ముఖాలైనాయి. హిమలాయ శిఖరసౌందర్యంలో భాగస్వాములమైన మాకు

బయళ్ళు, అడవులు, రోగాలు, క్షుద, సిద్ధార్థరాజకుమారునికి వల్లేదర్శనం అయ్యాయి.

పొలంలో కర్షకుడు, పొగగొట్టంపక్క కూలివాడు, ప్రాణంపోసిన ఇనపవస్తువులు, ప్రకృతిని కైవసంచేసుకోనబోయే ప్రజాహృదయం.

సూర్యసుతా అగ్నిస్వరూపిణీ! ఆనందమూర్తీ ఎక్కడేనువ్వు?

## ౬

ఏచదువులానాటివి? ఈనాడు దేవతామూర్తివంటి నాగురువు నన్ను ప్రథమాన్న గంగా యమునా సరస్వతీ సంగమ సౌందర్య రహస్యం తన నిడివైన వెన్నెలలో గులాబిమొగ్గవంటి దేశికాంగుళితో చూపించినాడు

నీవెవరవోబిడ్డ నిలిచినావీ బయలులో
నీజన్మ వెనకేమి. నీజాతివెనకేమిరా?
వెనుక తెలియనినీకు వేగ పొందుకుబాల
నెనక ముందుల శృతికి వేయిఅడుగులుముందు!"

అన్న ఆతని ఆంగ్లగీతము నాకు ఝల్లుమనిపించింది.

నీపరునదిలేక నీపరు ఆనకట్టలేదు, టెన్నెసీనదిలేక, టెన్నెసీ ఆనకట్టలులేవు. అనేక యుగాలనాటి గోదావరికి ఈనాటి ఆనకట్ట ధవళేశ్వరం దగ్గర! ఇంక ముందెన్ని ఆనకట్టలై సర్వప్రపంచమూ సస్యశ్యామలమౌనో!

నా సూర్యసుత మాయమైన ఈ ఆవేదనతో మావూరునకు పదిమైళ్ళ మార్గంలోఉన్న సముద్రతీరంలో కూర్చుండిఉన్నా! నాపక్క ఎవరో కూర్చున్నట్లే తోచింది.

ఏదో మధురమత్తత నన్నలమివేసింది. ఏదో దివ్యపరిమళాలు నాకు వివశత్వం కలుగజేస్తున్నవి. గజ గజ వణకినాను తల నిమ్మదిగా త్రిప్పినాను. నాప్రక్క సూర్యసుత నా వైపు ప్రేమపూరిత వీక్షణాలు పరుస్తూ కూచుని ఉన్నది.

"సు...సు...వ్వేనా!" అని నేను గద్గద స్వరంతో పలికాను.

"ఏమిటి అలా వణుకుతావు స్వామీ!" అని ఆమె ప్రశ్నించి, నా మెడచుట్టూ తన వెన్నెల కిరణాలచేతులు పెనవైచింది.

అది ప్రేమా! అదిమహాద్భుత సౌందర్యానుభవమా? అది సర్వ మానవ హృదయ పరివాహమా?

ఆమె నాకు ప్రసాదించిన అధరోష్ఠామృతము ఆకాశ తేజస్వరూప క్షీరసముద్రమథనజనిత మేనా?

ఆమె మాటలు త్యాగరాజస్వామి గీతాలా? శాలాల సాయంతనాల ఎరుపు వెలుగుఅంచుల కలిసిపోవు కాలము పడుచు ఎలవలపుల పాటలా? గోధూళిధూసరిత గోపబాలకుని పిల్లంగ్రోవిస్వనాలా? పాలకై కాలుకట్టిన చిట్టిపెగాల లెక్కగొనక ముంగుకురుసు అప్పుదూడల అంభారవాలా? గడ్డికోసిన మాలెతల పవిత్రకంఠగతక్రమగాంధర్వమా? ధాన్యయాత్రాన పని చేసి ఇంటికరుగు కూలీలజట్టుల గంభీరసంతోషనాదాలా?

"బాపూ! వచ్చావా? అంత ఆవేదన ఎందుకు, రానని?"

"నువ్వు దేవవనితవు, నా ప్రాణం కైకొంటావు! నాకు సహధర్మిణివి కాగలవా దేవీ?"

"ఓయి అమాయకబాలకుడా! లేకపోతే నీకు త్రివేణీ సంగమం కడ ఎందుకు కనుపించావు?"

"కనుపించావు, నా హృదయాని పువ్వు నలిపినట్లు నలిపావు."

"ఓయి కళాతపస్వీ! నీను అనుమానం నీ హృదయంలో ప్రవేశించింది. నేను మాయమయ్యాను. ముందుకు పోయేవాడు వెనక్కు చూచి, వెనకసంగతి తెలుసుకొని, వెనక్కు స్మృతిగా ముందుకు పోవాలి. బయలుదేరే వూరుఉంది. చేరేఊరుఉంది. విశ్వకళాకారునికి బయలుదేరిన ప్రదేశం తెరవెనక, చేరవలసిన ప్రదేశం తెరవెనక. కాని వెనకప్రదేశాలు తెలుసును ముందుచూపుకు గోచరమయ్యే ప్రదేశాలున్నాయి. అంతేకాని వదిలిన మజిలీకే మళ్ళీ చేరుతావా?"

"ఓసి దివిజబాలికా! నాకు వేదాంతంరాదు. కాని కళాతపస్వినై నిన్ను ప్రేమింపగలను. నీ దివ్యనీలలోచనాలలోని పరమ సౌందర్యాలు దర్శిస్తూ యుగాలు ఉండిపోగలను. నీ అద్భుత రేఖాసమన్వితాకృతరూపం ఎదుట పవిత్రార్చనలో కాలాంతమువరకూఉండిపోగలను. నీకాశ్మీరజామృతమసృణాధరాల నాకరకు పెదవుల అనంతముగా గాఢచుంబనాలీయగలను. సౌందర్యభావ దివ్యమూర్తివైన నిన్ను అదిమే నా యీ కఠినదృఢతరాశ్లేషంలో నిత్యుడను కాగలను దేవీ! దేవీ!!" అన్నాను.

"అలాగునా! అయితే సందేహం ఎందుకు? నేను కళను, నువ్వు కళాతపస్వివి, మనసంయోగము కళాసృష్టి. నేను అమృతాన్ని, నువ్వు అమరుడవు. మన సంయోగము లోకకల్యాణప్రదంకాదా? అన్నది."

పిపాసార్తుడనైననే నా సుధాకలశిని పొదవుకొన్నాను.



# మెట్లు

## ౧

ఆ మాలపిల్ల తెల్లబోయి చూచింది, తమగూడెంబయట ఆగిన కారు లోంచి దిగిన ముగ్గురు బాలికలనూ, ఒకయువకుణ్నీ ! ఎంతచిత్రమైన బట్టలు కట్టుకున్నారు. ఎంత తెల్లగా ఉన్నారు. వాళ్ళు కారులోంచి దిగగానే ఏదో గుమ్మైనవాసన ఆచుట్టుపక్కలంతా ప్రసరించింది!

ఈలాఅనుకొని ఆ పదునాలుగేళ్ళ ఈడుగలబాలిక తనవైపు చూచుకుంది, ఉతుకుఎరగని చెరిగిపోయిన తనపాతపోగులు పరిశీలించుకొంది. ఆ చిరుగుపాతే చీరలా వల్లెవేసుకుంది అప్పుడప్పుడు తానూ తలగడుగు పోసుకుంటుంది. అయినా తనవొళ్ళు ఆలా గుమ్మున వాసనేస్తుందా.

ఆదిగిన బాలికల బంగారపు ఒడలి కాంతులు చూచింది. తనదేహం కారునలుపు ! పళ్ళుతెలుపుమాత్రం ఆ బాలికలు జుట్టు ఎంత అందంగా దువ్వుకొన్నారో ? ఆపూలో ? ఆలాటిపూలే పూయవు తమగూడెంలో.

వాళ్ళువేసుకొన్న బంగారుహారం, చెవులకుపెట్టుకొన్న ఆలోలాకులు, చేతుల ఆసన్నని బంగారుగాజులు, అమ్మో, వాళ్ళుతొడుగుకొన్న ఆచెప్పులేమిటి, కిరస్తానీమిసమ్మతొడుక్కునే జోళ్ళకన్న ఎంత అందంగా ఉన్నాయో ?

వాళ్ళు కారెక్కివచ్చారు. అప్పుడప్పుడు దున్నపోతు స్వారితప్ప తనకేముంది. వాళ్ళు ఎంత తియ్యగా మాటాడుకొంటున్నారు ? మస్య మిసమ్మ మాట్లాడే ఇంగిలీషూ మాటాడుతున్నారు.

తనతల సంతనాడుతప్ప నూనే మెరుగును. తంగేడుపూలు, పొలంగట్టున బంతిపూలుతప్ప తాను పూలే మెరుగును. శివరాత్రి తీర్థంరోజున తాను గడ్డికోసి బజారులో జట్కావాళ్ళకమ్మి తేవచ్చిన డబ్బులో అప్పుడప్పుడయ్యేకియ్యకుండా దాచుకొన్న అణా, అర్థణా, కానీలు పోగుచేసుకొన్న పదణాలమూడుకానులతో కొన్న నాయవెండికడియాలు మురుగులేగా తనకు?

ఆ బాలికకు యౌవనం తొంగిచూస్తున్నది. పదునాలుగేళ్ళయినా కాయకష్టంచేసే జాతికాబట్టి త్వరగా ఈడురాదు. యౌవనం పొంగి పొర్లే ఆముగ్గురు నాగరక బాలికలకు కనుముక్కుతీరు ఎట్లాఉన్నా వయ్యారం దేహమసృణత్వము బంగారురంగు ఆ ప్రదేశం అంతా కాంతించాయి.

ఈ మాలపిల్ల మాచి. మోము రేఖలు శిల్పసౌందర్యాలు, విశాల నయనాలు సినీమాతారలు చూచి ఉడుకుబోతుతనంతో కుంగిపోవలసినవే.

ఈనాడు మాలమాచి ఆ అందాలబాలికల చూచి తెలియరాని ఆవేదనలోకుంగిపోయి కన్నులనీరు తుడుచుకుంది.

ఆరాత్రి మాచికి నిదరలేదు మాచికి పోతిగాడి సంబంధం కుదిర్చాడు తండ్రి. పోతిగాడు దున్నపోతులా ఉంటాడు. పోతిగాడు తనకు వద్దు ఈమాలగూడెం తనకువద్దు! చదువు. ఆపిల్లలులాఅవ్వాలి. ఆలా కారు ఎక్కాలి. ఆలాంటి నగలు, ఆలాంటి చీరలు, ఆలా! ఆలా!



మా చెమ్మస్కూలు ఫైనలుపరీక్షలో నెగ్గింది తనఊరు వచ్చింది.

" బాబూ! ఈ వూళ్లో ఉండలేను " అంది. ఎంతమందిబతిమాలినా ఉండనంది. ఇరవదవఏడున ఖద్దరుచీరా, ఖద్దరురయికా తొడుక్కొని

హరిజన సుందరి మాచెమ్మ సంపూర్ణ యవ్వనంతో మాలపల్లి చివర కరణంగారి మామిడితోటలోని పూతపూచిన గున్నమామిడిలా ఉన్నది. కాకతి సీమ కాలోత్పల విగ్రహంలా ఆమె వికసించింది.

ఆమె ఎంతచదువుకున్నా రంగేమి మారుతుంది? ఎంతచక్కని చీరలు కట్టుకున్నా నల్లరంగును బంగారం చేయలేవు. రహస్యంగా ఇంగ్లీషు మాస పత్రికలు కొనుక్కొంటూ! అందులో ఆంగ్ల అమెరికను స్త్రీలు అందాలు ఏలా సేకరించుకుంటారో చదివేది.

ఇంటిదగ్గిర పోరుపెట్టి తన గ్రామపుహరిజన సంఘంవారి సహా యంతో చెన్నపట్నం దుర్గాబాయమ్మగారి ఆంధ్రమహిళా సభవిద్యాల యంలో ఎనిమిదేళ్ళు చదివి మొదటి తరగతిలో కాశీవిశ్వవిద్యాలయ ప్రవే శపరీక్షలో కృతార్థురాలైంది.

ఉచిత విద్యావేతనం సంపాదించింది ఇంటరు చదవడానికి.

చదివే రోజుల్లో. రెండుమూడు సంబంధాలు తండ్రి తీసుకొని వచ్చాడు. ఒక హరిజనబాలుడు ఇంటరులో నెగ్గి తాలూకాఫీసులో గుమా స్తా ఉద్యోగానికి. ప్రభుత్వపు ఉద్యోగాల సమితివారు ఎన్నుకొన్నారు. మాచమ్మ ససేమిరా నేను పెళ్ళిచేసుకోనంది.

ఆరోజు సాయంకాలం తన ఊరుబయట కనబడినకారు. కారునుంచి దిగివచ్చిన అప్సరలు, ఆవయసుకాడు వారి కిల కిల సంభాషణలు, ఆ పడు చుల వయ్యారినడకలు. వారిచీరలు, వారి నగలు వారిదేహపు మిసిమితనం ఆహా ఆమె గజ గజ వణికింది.

చిన్న బాలికగా స్నానంఅంటే అసహ్యించుకొనేది. దుర్వాసన కొట్టే తాను చుట్టబెట్టుకొన్న పాత పేలిక తడపడంఅంటే ఆమెకు రోషం

వచ్చేది; సంతలో తెచ్చుకొన్ననూనె రాసుకోవడమూ అసహ్యమే !

ఆలాంటి ఆబాలికను ఆమోటారుకారు ఆ మూవురుబాలికలు ప్రథమ సోపానపంక్తి అయ్యారు.

ఆమెలో ఏమి స్పందించినదో ! అదివరదాకాఉన్నగూడెం మండి పోయింది ఆమె చూపులో—ఆ పొలాలు నేలలోనికి కుంగిపోయాయి. కాల్చిన పందిమాసం, ఎండుచేపలు, రొయ్యలు కాలకూటవిషాలై గంజి విషధార అయ్యింది.

మూడురోజులూ మాలగూడెంలో యమయాతన సలిపి, నాల్గవరోజు నమదరాసు వెళ్ళిపోయింది.

## 3

మాచమాంబఅని పేరుమార్చుకున్నది. ఇంటరుపరీక్ష ప్రథమతరగతిలో నెగ్గి విద్యార్థివేతనంతో వైద్యకళాశాలలో చేరింది

అందరితోనూ మాట్లాడేదికాదు మాచమాంబ. చదువుకొన్న కళాశాలలో అతిజామిందారికంగా మెలిగింది. ఎవ్వరీబాలిక ఎవ్వరీమాచమాంబ అని ఇంటరు విద్యార్థులు, విద్యార్థినులు కళ్ళతో ప్రశ్నిస్తే తాను మాలపిల్లనని చెప్పుకోలేకపోయింది. మంచిటాల్కుంచూర్ణం, పలచని పెదవులరంగు చక్కని సెంట్లు, పాము కుబుసులాంటి చీరలూఆవీ కొనేందుకు-వచ్చిన విద్యార్థివేతనం చాలకపోతే, తిండి తక్కువతిని అవన్నీ సంపాదించుకొన్నది.

వార్ధాఆశ్రమం వెళ్ళి హరిజనబాలిక అవడంవల్ల మహాత్ముని.ఆశీర్వాదాలు, ఇతరనాయకుల అభినందనాలుపొంది, కొంతవేతనం సముపార్జించుకొని మదరాసువచ్చింది. అక్కడస్త్రీల వేషభాషాదులలోని నిరాడంబరత స్నిగ్ధసౌందర్యమూ చూచి, సేవాగ్రామ ఆశ్రమంలో ఉన్నంతసేపూ ఏదో బాధకు లోనయింది కాని ఏదర్శనమైతే ఆమెనుమాలపల్లికి దూరంచేసిందో ఆ ఆశ తిరిగి మదరాసుకు రాగానే ఆమెను తనపంథానే నడిపింపచేసింది.

బాలకుల పొగడ్తలలో "ఈచీర బాగున్నది, నీవేషం మహాద్భుతం" అన్నముక్కలే వినేదికాని "నువ్వు సౌందర్యరాణివి" అన్నమాట ఒకనాడూ వినలేదు.

ఒకతోటివిద్యార్థి ఎప్పుడూ మాచమాంబను అనుసరించేవాడు. అతడు ఆమెతోఎంతోస్నేహం చేశాడు. ఆమెను సినీమాలకు తీసుకువెళ్ళాడు. ఆమె దగ్గరగా చేరి రెండుమూడుసార్లు ఆమెవృక్షవక్షనిధులపై హస్తతలం పారించి స్పర్శించి, అదిమినాడు. అప్పుడా బాలికకు వివశత్వం కలిగింది. ఒళ్ళంతా విద్యుల్లతలు ప్రసరించాయి. కాని ఆబాలుడు తన్ను ప్రేమించి ఆలా చేయలేదనీ, తన్నుక్షుద్ర జాతిబాలికగా ఎంచి. క్షుద్రజాతివారికి నీతి నియమాలుండవని ఎంచి, వాడు ఈలాగున్న అవమానం చేశాడనీ భావం కలిగిందామెకు.

ఆమె అవమానంతో కుంగిపోయింది తోకతొక్కినభుజంగిలాబుస్సుమన్నది. మరునాడా బాలుడు సంతోషంతో పలుకరించగానే వానితో "ఓరి దుర్మార్గుడా నేను హీనజాతిదాననుకదా. నీపశుత్వానికి అడ్డంపెట్టననుకున్నావా? ఇక్కడనుంచి నాతోమాట్లాడకు, నువ్వు విషపుజంతువవు!"

అని మండిపోయింది. ఆ యువకుడు తెల్లబోయి తలవాల్చుకుని వెళ్ళిపోయినాడు.

ఆమె ఆనాటినుంచి తనతరగతిలో బాలకులతోగాని, తన కాలేజీలోని ఇతరతరగతుల యువకులతోగాని మాటలాడటం మానివేసింది.

ఒకనాడు మాచమాంబిక ఒక ఆచార్యుని ఇంటికి వెళ్ళింది. అప్పుడప్పుడు తెలియని విషయాలు చెప్పించుకొనడానికి విద్యార్థులు విద్యార్థినిలు తమకు వివిధపాఠాలు చెప్పే వివిధ ఆచార్యుల ఇళ్ళకు వెళ్ళే అలవాటున్నది.

ఆ అలవాటుచొప్పున మాచమాంబ తానున్న బాలికా వసతిగృహంనుంచే బయలుదేరి తమతరగతికి ఆచార్యులలో ఒకాయనకు ఏదోపాఠం చెప్పించుకోడానికి వెళ్ళింది. ఆమె చదువుదీక్ష ఆ ఆచార్యులకు తెలుసును. ఆమె గ్రహణశక్తి తక్కువే. కాని, అది తెలుసుకొన్నంతవరకు నిద్రాహారాలు మానివేస్తుంది. తెలుసుకొనికాని ముందుకు అడుగువేయదు.

ఆ ఆచార్యులు మధ్యమవయస్సుకలవాడు ఆమె సౌందర్యం అతన్ని ఆకర్షించలేదు. ఆమెయవ్వనం, ఆమెదీక్ష, ఆమె దేహపుజిగి అతని హృదయాన్ని కలతపెట్టాయి. ఈ బాలిక ఎవరో పేదవారిబిడ్డ. కొంచెం అనువయిస్తే తనకోర్కెను ఎందుకామె తీర్చరాదు ?

ఆరాత్రి ఎనిమిదిగంటలకు పాఠం. ఆ ఆచార్యులు ఆమెను తనపక్కనే సోఫాపై కూర్చుండబెట్టుకొని బోధిస్తున్నాడు. వియాదాలాపంగా వేసినట్లో తనచేయి ఆమె తొడపై వేసినాడు. ఆమె పాఠంచదివే దీక్షలో ఆ చేయి నంతగా గమనించలేదు. ఆచేయి- ఆచేయి నెమ్మదిగాఆమె బొడ్డు కిందకు జరిగింది. ఆమెకు ఒక్కసారిగా మెలకువవచ్చింది. ఆమె గభుక్కు

న ఆతనిచేయి తీసిపారవ్వేసి, లేచి, ఆడుపులై “ మీకు బుద్ధిఉందా, ఇదా మీరుపాఠంచెప్పడం ! ” అని ఆపుస్తకాలన్నీ అక్కడేఉంచి విస విస గది విడిచి వెళ్ళిపోయింది.

తన సొమ్ముసంచీ మొదలైనవి ఉంచుకొన్న అలంకరణపుసంచీ అక్కడే ఉండిపోయినందున తిన్నగా నడిచే తన వసతిగృహంచేరింది.

అందరు ఆచార్యులు అందరువిద్యార్థినులూ అలాగే చేస్తారా ? లేక తనకొక్కర్తికే ఈ పరాభవమా ? ఆమె కుంగిపోయింది. ఆ మరునాడు ఉదయం ఆ ఆచార్యులు ఆమెగ్రంథాలు, సంచీ అన్నీ పంపిస్తూ ఆ అలంకరణపుసంచిలో ఒకలేఖఉంచాడు.

“అమ్మాయీ క్షమించు! ఇది నా అపచారంకాదు! నేనుఒంటివాడను. భార్యపోయిన మధ్యకాలపువాణ్ణి. వైద్యాలయంలో దాదులు నాకోవిద్ధమైన తృప్తితీరుస్తున్నారు. కాని సరియైనమందుకూ, ప్రకటనపు మాయమందుకు నాకు తేడాతెలిసిందికాదు. రాత్రింతా నిదరపట్టలేదు. నేను పడినబాధ అనంతము! కంచెచేనుమేస్తే లోకం నాశనమే ! నేను నలభైఒక్కఏళ్ళవాడిని. నాకు భార్యలేదు. ఇద్దరుబిడ్డలు. ఇద్దరూ మేనమామలకడ బెంగుళూరులో చదువుకొంటున్నారు నిన్నుగురించి విచారిస్తే నువ్వు హరిజన బాలికవనీ చెక్కుచెదరని శీలంకలదానివనీ తెలుసుకున్నాను. నువ్వు నన్ను వివాహంచేసుకో. నేను తెలుగు బ్రాహ్మణుణ్ణి ! నువ్వు నన్ను ప్రేమించవ లేకపోవచ్చును. కాని ఉత్తమగృహిణీ ధర్మమే ప్రేమకాగలదని నా నమ్మకము. నీకుఇష్టముంటే నీకున్న కుంకుమపువ్వురంగుచీరకట్టుకొనిరా! లేకపోతే ఏచీరకట్టుకున్నా సరే ! ఆలోచిస్తానుఅనదలచుకుంటే పువ్వులులేని తెల్లచీర

కట్టుకురా! ఇంట్లక్షుంతవ్యుడైనరావు”అని ఆతడు ఉత్తరం వ్రాశాడు. ఆయన పేరు డాక్టరు సి. పి రావు.



మాచబాంబిక ప్రభుత్వవైద్యశాలలో వైద్యురాలయినది. భర్త డాక్టరురావుగారు నెల్లూరులోనే జిల్లా ముఖ్యవైద్యాధికారి అయినాడు. మాచమాంబ పేరు డాక్టరుమాచమాంబారావు. ఆమె అసిస్టెంటు సర్జనుగాఉన్నది. ఆమెకు ఆమె కాలేజీ విద్యార్థినిగా ఉన్నప్పుడే వివాహం అయింది.

డాక్టరురావు గురువుల వివాహపత్త్రం పదే పదే చదువుకొనిమాచమాంబ ఆలోచించుకొన్నది. ఉత్తరమువచ్చిన మూడురోజులవరకూ ఆమెకదే ఆలోచన. తాను హిందూజాతికాలికింద నలిపబడుతూఉన్న మాలపిల్ల. డాక్టరురావుగారు బ్రాహ్మణుడు. పెద్దవాడయితేఏమి. పదమూడు పన్నెండుసంవత్సరాలతేడా పెద్దతేడాకాదు. తనతోటియువకులు తన్ను వివాహం చేసుకుంటారా? ఆరేడువందలజీతము, కారుకలిగిఉన్నభర్త- తనచదువుపూర్తి—తనకుకావలసినచీరలు—నగలు—కారు—తనచదువున కాయన కిరీటం కాగలడు!

ప్రేమా? తనకు ప్రేమఅంటే ఏమీ తెలియదు. డాక్టరురావు అంతఅందమైనవాడుకాడు. ఆతన్ని తాను ప్రేమించగలదా? ప్రేమఅనేది జంతుధర్మానికి-మానవమనస్తత్వం రంగరించిన ఒక మందు-తాను ప్రేమించగలుగునోలేదో! ఏదైనా ఆయన్ను వివాహంఆడడంవల్ల తనకు అన్నీలాభాలే!

ఏకారణంవల్లనయితేఏమి ఆ ఉత్తముడు తన్నువివాహంచేసుకుంటానన్నాడు.

ఆమె మూడవనాడు 'కుసుంబాచీర కట్టుకువెళ్ళింది. అందాకా వట్టి తెల్లచీర కట్టుకొని వెళ్ళేది. ఆ మరునాడుసాయంకాలం ఆమె పుస్తకాలు పట్టుకొని డాక్టరురావుగారింటికి వెళ్లింది. వారు పెళ్ళివిషయం అన్నీమాట్లాడుకున్నారు.

పెళ్ళి రిజిష్టరూ అయింది, హిందూవివాహంచొప్పునా అయింది వైద్యకళాశాలాచార్యులు, వైద్యాధికారులు మొదలైన వారెందరో వచ్చినారు. కాని ఆమె తన తలితండ్రులనూ, చుట్టాలను ఎవ్వరినీ రావద్దంది.

భర్త తనకు ఈనాడు అన్ని సౌకర్యాలు పొందడానికి కారణం అయ్యాడు. కావలసినని ముద్దినిసుముక్కాలు చీరలూ ఉన్నాయి. చక్కని అతినవీనరకపు నగలు, అందమైనకారు. జిల్లావైద్యాధికారి బంగాళా. ఇంగ్లీషుక్లబ్బు. అనుకున్నవి జరుగుతున్నాయి. కాని ! కాని !

భర్తకు మొగం అందంకాకపోయినా ఇరవయ్యేవన్నె బంగారు ఛాయ. తాను గర్భవతికావచ్చు. పురిటికి సెలవు పుచ్చుకొంటుంది. తనపై అధికారైన భర్త-పురుడు పోయగలరని ఆమె కలలు గన్నది.

ఆమెకు కామతృప్తి, భర్తకుకామతృప్తి అవుతున్నది భర్త ఒక విధంగా రసికుడే. తనకేమి తెలియును రసికత! అందుకై ఎన్నో స్త్రీపురుష సంబంధగ్రంధాలు చదివినది. కష్టపడే విద్యార్థినిగా తయారయింది. ఈ విషయంలో కష్టపడే విద్యార్థినే.

వారివివాహం అయి మూడేళ్ళు నడిచింది. కాని వారిద్దరిలో ఏదో అసంతృప్తి ఉన్నదని ఆమె గ్రహించేది. ఆమె యవ్వనంచూచి ఉద్భవిం

చిన వాతావరణం చూడక, తొందరపడి ఆ బాలికను చేసుకొన్నాడు. తన గతి నల్లకుక్కను తెల్లకుక్క చేసే ప్రయత్నం అయింది. మంగలి బ్రాహ్మణుడెట్లా అవుతాడు? అనాగరకజాతి స్త్రీ ఎంతచదువుకుంటే ఉత్తమసంస్కారుని భార్య కాగలదు? ఆతని మొదటిభార్య జ్ఞాపకం వచ్చింది. బిడ్డలను అప్పుడప్పుడు బెంగుళూరు వెళ్ళి చూచివచ్చేవాడు.

భార్య తన కౌగిలింతకువచ్చిన మొదటి సంవత్సరం ఆతడు కామతృప్తి నందేవాడు. తరువాత ఆతడు ఆమెలో ఏదో లోటును గుర్తింపసాగినాడు ఆమె తనదేహం ఆతనికి అర్పించేది. కాని ఆమె ఎక్కడో ఉండేది? ఆమెలేని ఆమె దేహమాత్రమూర్తిగా తోచి ఆతడు వ్యధనొంది భార్యను తనపడకగదికి పిలిచేవాడుకాదు.

ఆమె బాధపడేది. ఆతడు వట్టిపురుషునిగా తన్ను కోరేవాడు. తాను పూర్ణపురుషుని వాంఛించింది. ఆతడు పశువులావచ్చి పశుతృప్తి పొంది తన్ను తన పడకగదికి పొమ్మనేవాడు.

## ౨౪

ఒకనాడు లేడీఆస్పత్రిలో లేడీఅసిస్టెంటు సర్జను డాక్టరు మాచమాంబారావుగారు ఒక స్త్రీరోగిని వైద్యాలయంలో చేర్పింపవలసి వచ్చింది. ఆమె గర్భవతి ఆరోగికి ప్రతిపురుడూ అసాధ్యమై ప్రాణాంతమువరకూ వస్తున్నది. ఆ వచ్చినస్త్రీ ఖద్దరుధారిణి. ఆమెకు ఏరోగమూ లేదు. కాని పురుడుమాత్రమే కష్టం. ఆమె ముగ్గురు ముత్యాలలాంటి బిడ్డలతల్లి!

వారిద్దరు ఈమాటా ఆమాటా చెప్పుకొనడం ప్రారంభించారు. ఆగర్భగుర్విణికూడా తన భర్తకు రెండవభార్య. ఆమె తన భర్తనుగూర్చి మాట

కురెండుసారులు చెప్పుకొని ఆనందించింది. ఆమె మహదానందము వైద్యురాలు మాచమాంబకు ఆశ్చర్యం కలుగజేసింది.

రోగి:—డాక్టరుగారూ మావారికివచ్చుజీతం అరవైరూపాయలన్నా మాసంసారం ఏదోగుప్తంగా లోట్లులేకుండా జరుగుతున్నాదండి. ఈ యుద్ధంవల్ల కర్చు ఎక్కువైనమాటనిజమే. కాని యుద్ధభత్యం ఇంకోపది రూపాయలిస్తున్నారు. మాకు భూములువల్ల సాలుకు ఆరువందలువచ్చునవి. పంటలకు ఖరీదులు ఎచ్చి ఇప్పుడు పదిహేనువందలు వస్తున్నాయి.

డా-మాచ:—ఇప్పుడు మీసంసారం చక్కగా జరుగుతోందన్నమాటా ?

రోగి:—ఆ!

డా-మా:— ఒక వారంరోజులలో మీకు పురుడు వస్తుంది. ఇంతవరకూ ఆలశ్యం చేశారేమమ్మా?

రోగి:— నేను మావారినిఏలావదిలి ఉండగలను డాక్టరుగారూ వారు వండుకొంటారు. పిల్లలను చూసుకోగలరు. మా సవతిపోయినఏడే-నా పెళ్ళి. తర్వాత మూడేళ్ళవరకూ నేను కాపురానికి రాలేదు. తాలూకాఫీసుపని-ఎన్ని తాలూకాలో బదిలీ-తామే తమకూ, తమ ఇద్దరిబిడ్డలకూ వంటచేసుకొనేవారు. ఇప్పుడు నేను వారినెల్లా వండుకోనివ్వగలను చెప్పండీ?

డా-మాచ:—మీకు ఇద్దరు సవతిబిడ్డలా?

రోగి:—అవునండి నేను కాపరానికి వచ్చినప్పటినుంచి ఆ పిల్లలు "అమ్మా, అమ్మా" అంటూ నన్ను వదిలితే నేనా? నా బిడ్డలమీదకన్న వాళ్ళమీదే నాకెక్కువా పేక్షండి.

ఆమె పురుడు డాక్టరు మాచమాంబరావు తానే స్వయంగా పోసింది. ఆమె భర్త, కాపురంచేసే ఇద్దరిసవతికూతుళ్ళు, ఆమెస్వంత బిడ్డలు అందరూ ఆ బాలెంతను చూడడానికి వచ్చారు. వారి ఆనందము వర్ణనాతీతము. డాక్టరు మాచమాంబారావు కన్నులనీరుతిరిగింది.

గర్భవతి అవడం ఎంతఆనందం? గర్భవతులుగా ఉన్నప్పుడు స్త్రీలు అందవికారాలు పొందుతారు. అది అందవికారమా ? ఆలా పాలిపోయి, లా వెక్కి-నీరుపట్టి కదలలేక ఆస్త్రీలు దేవతామూర్తులులా ఉంటారే? బిడ్డలకనడం పశుధర్మం. బిడ్డలకు పాలివ్వడం పశుధర్మం. బిడ్డలను రక్షించడం పశుధర్మం బిడ్డలు పాలు తాగేటంతవరకు ప్రేమించడం పశుధర్మం. కాని ఆలా పెద్ద వారైన బిడ్డలను. తలితండ్రులను చుట్టాలను. స్నేహితులను ప్రేమించడం? అది మానవధర్మం దివ్యధర్మం.

అది వర్ణనాతీతం, తన పొంకాలైన వక్షోజాలు బిడ్డలకు ఎప్పుడు పాలియ్యగలవు. తెల్లని ఆ అమృతధారలు తనబిడ్డ గబుకు గబుకున పుణుక గలదు?

ఆ బిడ్డలతండ్రి, ఆ బిడ్డలు తనగర్భాన మూర్తించడానికి కారణం తనభర్త! తనభర్త జిల్లావైద్యాధికారి! ఒక బ్రాహ్మణుడు. తనకై క్రింకుదిగిన వ్యక్తి! తన్ను చేయిబట్టి మెట్లెక్కించిన దేవతామూర్తి—తన బిడ్డలకు తండ్రికావాలి. తనకేరి బిడ్డలు-తన్ను "అమ్మా" అని పిలవరూ డాక్టరుగారిని-"నాన్నా"అని పిలవరూ! వారు తనకు సర్వనాగరికతలు ధారపోశారు. వారు దేవతామూర్తి-వారుభగవంతుడు-తానెవరు?-తానెవరు?-

ఆరాత్రి ఆమె సాధారణంగా అలంకరించుకొనే విధంగా అలంకరించుకోలేదు.

ఆమె సాయంకాలమే తలంటుకొన్నది. నల్లటి తనపొడుగాటిజుట్టు వదులువాల్జడ వేసుకొంది. కనకాంబరాలు తలలో ధరించింది. చెవుల దుద్దులుమాత్రం. మెళ్లో పుస్తెలతాడు. ఒక సన్నని బంగారుగొలుసు. నుదుట ఇంత కుంకుమబొట్టు. బంగారురంగు రవిక. కుసుంబారంగుచీర కుసుంబా రంగుగాజులుధరించింది.

నల్లటి ఆమెమొగాన పౌడరులేదు. పెదవుల ఎఱుపురంగులేదు

ఆమెరాత్రి వారిద్దరిగదికీ మధ్యనున్న తలుపు తెరువబోయి, అది వేసిఉండటంవల్ల, వారి గదిలోకి వెళ్ళే ముఖ్యద్వారం వెంటనే లోపలికి వెళ్ళింది.

ఆ జిల్లావైద్యాధికారి పురుషుడు. కుంగి సోఫాలో కూర్చుండి చుట్ట కాలుస్తూ ఏదో వైద్యపత్రిక చూస్తున్నారు.

మాచమాంబ తిన్నగా భర్తదగ్గరకు వెళ్ళి సోఫాదగ్గిర భూమిమీద మోకరించి భర్తవొళ్లో తలవుంచింది.

ఆయన తెల్లబోయాడు. ఎవరీమె? ఆమాలపిల్లా ?

ఆమె సంపూర్ణమూర్తిగా, పూర్ణభార్యగా వచ్చినదన్న ఒక పరమ శ్రుతి ఆయన హృదయంలో మారుమ్రోగింది. ఆయన గడగడలాడిపోయాడు! ఆమె ఎక్కడో ఏదో గ్రామంలో ఊరిచివర ప్రపంచాన్ని తెల్లబోతూ చూస్తూఉన్న అనాథబాలికయై ఒకదేవుని కై ఒకపరమపవిత్ర నాథునికై, జీవితానికై చేతులుచాచి నిలుచుండిపోయిన బాలికయై ఆయనను గోచరించింది.

ఆయనలోని పురుషత్వము, మానవత్వము, దివ్యత్వము, భర్తృత్వము, జనకత్వం ఒక్క మహాపుష్పంలోని అన్నిరేకులై విప్పారినవి.

ఆతడామెను తన హృదయానికి గాఢంగా, గాఢంగా, లలితంగా, తమిగా, గౌరవంగా, కామంగా, ప్రేమగా, అదుముకొన్నాడు!

## ౬

డాక్టరు మాచమాంబకు పండులాంటి ఆడపిల్ల పుట్టింది. భర్తగారి తల్లిపోలిక అట.

జిల్లావైద్యాధికారి డాక్టరు సి. పి. రావుగారు నల్లని తన మాలపిల్లలో భారతిజాతియొక్క అడుగుమెట్టు చూచినాడు. పైమెట్టు అడుగుమెట్టు ఒకటే. భారతదేశంలో పంటపండవలసిన శాలిభూమి తనభార్య. అసలుపు బంగారానికి రెండవచాయ!

ఆమె హృదయం కోటిబంగారాలవిలువ. ఆమె అమృతమూర్తిఅయి పోయినది. ఆమె నీలనీరదగాత్ర అయినపార్వతి! ఆమెధరిత్రీమాత! ఆమె ప్రపంచాన్ని కరిగించే ప్రేమతో తన సవతిబిడ్డలను హృదయాని కదుముకొన్నది.

తనబిడ్డకు తానే రొమ్ముకుడుపుతూ వైద్యరాజయిన భర్తను బ్రహ్మానందవీక్షణాలతో చూస్తున్నది.



# నేల

## ౧

ఓ నేలా! మా తల్లీ! నీకెంత దగ్గిరమ్మా మేము! నీకూ మా సుబ్బన్నకూ మధ్య చాపన్నా లేదు. నీకూ మా సుబ్బన్న దేహానికి ఒక చొక్కాగాని ఓ పంచెగాని అడ్డం లేదు. నీకూ మా సుబ్బన్నకూ మధ్య నీలోనుంచి తీసిన ఓ నాపరాయన్నా లేదు.

మా సుబ్బన్న ఎక్కడినుంచి వచ్చాడు తల్లీ! నీ పిల్లలందరూ నీలోంచే వచ్చారు. ఆకాశంలోంచి వచ్చిన కోటీశ్వరులు నీ రొమ్ము మీద నించోలేక, పడుకోలేక, కూర్చోలేక ఏనూడంతస్తుల మేడలో కట్టుకుంటే ఏమి?

మా సుబ్బన్న తల్లెవరు తండ్రెవరు? మా సుబ్బన్న దేవూరు, ఏ జిల్లా, ఏ నాడు? మా సుబ్బన్న నడిగినా వాడే చెప్పలేక పోయాడు! హైదరాబాదు వీధుల్లో పెరిగాడు, హైదరాబాదు హోటళ్ళల్లో బల్లలు కడిగాడు "చా"లు అందిచ్చాడు, హైదరాబాదు రిక్షాలు లాగాడు, హైదరాబాదులో పేపర్లు ఇంటి ఇంటికీ పంచాడు!

మా సుబ్బన్న క్రిందే పడుకుంటాడు. వాడు వేసుకునేందుకు చాపలేదు, పక్కలేదు, పరుపులేదు, మంచం లేదు! వానవస్తే, ఎండకాస్తే; తడుస్తాడు, ఎండుతాడు. ఏ పంచనో నిలుచుంటాడు, ఏ మూలనో పండుకుంటాడు!

హైదరాబాదు సిమెంటు రోడ్లు, హైదరాబాదు గల్లీలు, మురుకు తూములు సారాదుకాణాలు, పానుదుకాణాలు, కంపులు ఈగలు, దోమలు, చేతులకజ్జిలు, బొకులు, జంబియాలు సుబ్బన్నను అరికట్టలేక పోయాయి! దీనికి

కారణం పద్దెనిమిదేళ్ళ ఈడువాడయిన సుబ్బన్న 1942 వ సంవత్సరంలో మొట్టమొదట ఉద్భవించిన సైకిలు రిక్షాలలో ఒకదానిని తొక్కుతూ అద్ద వసూలు చేయడంలో వచ్చింది.

౨

సుబ్బన్నకు ఉరుదూ తెలుగు, తెలుగుఉరుదూ, తెలుగుకన్నడం, కన్నడంఉరుదూ, ఉరుదూకన్నడం, మహారాష్ట్రకన్నడం, కన్నడమహారాష్ట్రం– మహారాష్ట్రఉరుదు, తెలుగుమహారాష్ట్రం– మహారాష్ట్రతెలుగు– తెలుగు కన్నడ ఉరుదు– ఉరుదు తెలుగు కన్నడం– తెలుగు కన్నడం ఉరుదు వగైరా వగైరా అన్ని భాషలూ వచ్చును–

ఆ రోజు రిక్షాలో ఇద్దరు మహారాష్ట్రబాలికలను తీసుకుపోతున్నాడు మాట్లాడుకున్నది పాంచణా పైసలు. అక్కడ దిగగానే ఒక అణా ఎక్కువడిగాడు! ఆ బాలికలిద్దరూ మండిపడ్డారు– "ఏమిరా పంది! నువ్వు చదువుకోకపోడం మూలాన నీబుద్ధులు మురికిలో పొర్లే పందిబుద్ధులు" అని ఆ బాలికలిద్దరూ ఆ అయిదణాలు రిక్షాముందు నేలమీదపడేసి విద్యాలయంలోనికి చక్కాబోయారు.

ఆలాగే మాసుబ్బన్న నిలబడిపోయాడు! వాడికున్న ఆకొంచెం మనస్సు ముద్దముక్కలయిపోయింది– నేను పందిని! నేను మురికిలో పొర్లుతాను! నేను పందిని! నావి పందిబుద్ధులు?" వాడి ఆలోచన, వాడి మానసిక ప్రపంచం చుట్టూ, రెచ్చకొట్టబడిన తేనెటీగలా తిరిగింది.

ఓ నేలతల్లీ నీకుసూరుడు సుబ్బన్న కళ్ళల్లో వేడినీళ్ళుతిరిగిన పంగతి నువ్వుచూశావమ్మా ! ఓ నేలతల్లీ ఎంతమందమ్మా నీబిడ్డలకు ఈలాంటి అవమానాలు?

కోటీశ్వరుల దొంగమార్కెట్టులలో వర్తకనీతిప్రకారం తమ ఆత్మలకు విషం, మకిలీ, దుర్గంధము పూసుకొని మానవ జీవితకశ్మలంలో పందులకన్న అధ్వాన్నంగా. లుక లుక పురుగులకన్న నీచంగా ఓలాడినవారు ఆకాశంలో ఎగిరే అందమయినా పక్షులా తల్లీ ! ఈ ఆలోచనసుబ్బన్న హృదయంలో పుట్టుదామని ప్రయత్నించింది, కాని వాడు చదువుకోలేదు, వాడుకవిగాడు, పభుత్వోద్యోగికాడు!

సుబ్బన్న వేడికంటినీరు తుడుచుకు నేందుకు పైన కండువా న్నాలేదు. జుమారత్ బజారులో అమ్మేబట్టలు నేలసంబంధమైనబట్టలే. అవి ఇస్త్రీలు ఎరగవు- మా సుబ్బన్నచొక్కా- చిరుగులతో ఇరవైఏళ్ళ జీవి జీవితంతో, ఇరవై ఏళ్ళ చెమటలతో, మురికితో మానవజీవిత కష్టనిష్టూరాలతో చివికి చచ్చుదారాలపోగులైనపాత ! రెండణాలకుజుమారత్ బజారులో సుబ్బన్న కొన్నదే.

" నేను పందిని సదువురాదు ! " ఆరిక్షాను సుబ్బన్న ఆరిక్షా యజమానికి తిరిగి ఇచ్చేశాడు.

ఓ నేలతల్లీ ! గోలుకొండకుపోయేదారిలో పొలంలో నీ హృదయం పైన పండుకొని మా సుబ్బన్న వెక్కి- వెక్కి- ఏడ్చినసంగతి నీకు జ్ఞాపకం లేదూ ! ఓ నేలతల్లీ ! నీ మనస్సులో నిర్మలంగా ప్రత్యక్షంఅయ్యే ఉస్మాన్ సాగరులోనా నీ సుబ్బన్న చచ్చిపోదామని దిగాడు ? దిగినమాట వాస్తవమే ! ! మోకాలులోతు పోయాడు సముంద్రానికు దిగాడు, కొమ్మ ములిగే

టంతవరకూ ముందుకు నడిచాడు, కంఠం నీళ్ళల్లో మేలమాడింది. అటు చూచాడు ఇటుచూచాడు, దూరంలోఉన్న నీ వక్షోజాలయిన కొండలు చూచాడు. నీ నవ్వులైన పువ్వులచెట్లు చూచాడు. నీ ఆలోచనలైన పొలాలు చూచాడు ! " రామ రామా " అని ముందుకు నడిచాడు.

# 3

కాని ఓ నేలతల్లీ ! అక్కడ నువ్వు కొంచెంపైకి ఉబికిఉన్నావని వాడికేం తెలుసు ! నీరు కంఠంనుంచి రొమ్ముక్రిందకు దిగింది. ఇంకాముందుకు వెడితే నడుంకిందకు వచ్చింది, మా సుబ్బన్న ఎదురుగుండా దూరంగా వున్న ఆ కొండలు చూచాడు. ఆ గుట్టలావతల ఏమివుంటుంది? పొలాలు. గుట్టలు. వాని అవతల ఇంకా పొలాలు గుట్టలు ఆగకలుకట్టుకొని వ్యవసాయాలు. పశువులుపొలాలు పూలచెట్లు గ్రామాలు హైదరాబాదువంటి పట్టణాలు, రైళ్ళు, మోటార్లు అట్లా అట్లా తాను వెళతాడు. ఎక్కడభూమి ఆఖరైతే అక్కడ ఆగుతాడు. ఆతర్వాత ఆకాశమో ఏమో ?

మాసుబ్బన్న వెనక్కుతిరిగి గట్టెక్కాడు. ఓ నేలతల్లీ ! నీ హృదయం నీ మీదే నడిచాడు మాసుబ్బన్న. ఉన్న రెండుపొలాలు వంటిమీదే అరాయి. కడుపులో ఆకలి దావానలం అయినా చెయ్యి చాచి దేహీ అని ఒక్కణ్ణి అడుగలేదు కాని ఓ నేలతల్లీ ! నీబిడ్డలింకా అక్కడక్కడున్నారుసుమా! మాసుబ్బన్నకింత గంజో, ఇంతపిడచో నాయనా తాగుతినుఅన్నారు. మా సుబ్బన్న ముందుకు సాగిపోయాడు.

ఓ నేలతల్లీ ! నీబిడ్డలైన తేళ్ళు మా సుబ్బన్నను కుట్టలేదు! పాములు కరువలేదు. పెద్దపులులు ఘాండ్రుమనలేదు. కాని నీ సవతిబిడ్డలైన పోలీసు వాళ్ళు భూకామందులు ఏదో చదువుకొన్నవాళ్ళు మా సుబ్బన్నను చూచి ఎవడురావీడు అనుకున్నారు. కోటీశ్వరులకోసం వేసుకొన్న రైలుపట్టాలు కూడా నీబిడ్డలకు పనికివస్తాయా ఓ నేలతల్లీ ! అలా రైలుపట్టామార్గమే పుచ్చుకొన్నాడు మాసుబ్బన్న. కతిపయప్రయాణాలు చేస్తూ హైదరాబాదు చెల్లెలైన పూనా చేరుకున్నాడు.

ఓ నేలతల్లీ ! నీ అనుగు కుమారుడు సుబ్బన్న పూనాల్లో ఏమి చెయ్యాలి ! రైలుదగ్గిరనుండి ఊళ్లోకి సామానుతీసుకువెళ్ళే కూలివాడయ్యాడు. సుబ్బన్నబట్టలు చూస్తే దొంగ అనుకున్నారు మొహంచూస్తే హరిశ్చంద్రసంతతి అనుకున్నారు ప్రజలు.

ఒక మహారాష్ట్రుడు తన ఇంటిలోపనివానిగా ఉండమన్నాడు. ఓ నేలతల్లీ ! ఆ యజమాని నీ సుబ్బన్నకు గుండులాంటి ఖద్దరు పొట్టిలాగూ, చొక్కా ఖాకీరంగువీ ఇచ్చాడు. కాని ఆబట్టలు నీరూపమే నీరంగే ! నువ్వే నీప్రియపుత్రుణ్ణి పొదువుకొన్నావు.

నువ్వు నీలో నవ్వుకున్నావు నేలతల్లీ ! స్వామీదేపడుకొనే నీ పుత్రుణ్ణి హృదయానకు అదుముకునేదానవు. ఇంటినాటుకింద పడుకునే సుబ్బన్నను చూచితిట్టేవారు, చివాట్లు పెట్టేవారు. వాళ్ళకేమి తెలుస్తుంది మీ ఇద్దరి మధ్యనా ఉన్న చుట్టరికం.

క్రిందపడుకొనేమనుష్యుడు దొంగఅవుతాడా నేలతల్లీ ! వర్తకమని వడ్డీఅని, పెట్టుబడిఅని, పెత్తనమని; కొట్లుపెట్టి, గవాణాలుచేసి, దిగుమ

తులుదించి, మిల్లులు, పరిశ్రమలు పెట్టి నీబిడ్డలర క్తం త్రాగే కోటీశ్వరులు దొం గలుకారూ? వాళ్ళుదొరలు, యజమానులు, ఖామందులు, మాలిక్‌లు, జమీం దారులు, సంస్థానాధీశ్వరులు, ఫోర్డులు, రాఖ్ ఫెల్లరులు, బీవర్ బ్రూకులు చర్చిల్లులు, ఆమెరీలు, హిట్లరులు, ఫ్రాంకోలు, నవాబులు, జాగీరుదారులు, వారు దేవతాపుత్రులు నీ బిడ్డసుబ్బన్న నేలపుత్రుడు.

సుబ్బన్న దొంగతనం చేయగలడా నేలతల్లీ ? ఆతని యజమాని ఇంట్లో వెండిగిన్నెపోయిందే అనుకో ! అది సుబ్బన్న కెందుకు ? నీలోనుంచి ఉద వించిన మోదుగ, అడ్డ అరటి తామర, మఱ్ఱిఆకులలోతినే సుబ్బన్నకు వెండిగిన్నా ? నేలతల్లీ ! నీ గర్భంలోంచివచ్చినవెండి, బంగారము, రేడియము ప్లాటినము దేవతలు లాక్కున్నారుకాదూ, అవన్నీ సత్యవంతులయిన నీబిడ్డ లు కూలీలు, పాలంకాపులు, బిచ్చగాళ్ళు, గుంపులవాళ్ళు, అడవివాళ్ళు, ఊళ్ళ బయట విసరవేయబడ్డవాళ్ళు, ఒట్టులుదికేవాళ్ళు, పాయిఖానా ఎత్తేవారు, కుండలుచేసేవారు, దేవతలముఖాలు నిష్కారంచేసేవాళ్లు వాళ్ళకందరికీ ఉప యోగించినాడుకాదూ నీసొమ్ము నీకగడం !

నీసుబ్బన్న మాలిక్ ఇంట్లో వెండిగిన్నెపోగానే సుబ్బన్న తీశాడని అన్నారే, వారిహృదయం రాయికాదు, రప్పకాదు, కెమికల్ లేబరేటరీలో తయ్యారయిన విషపుబాంబుగాని !

అల్లాఅంటే ఊరుపేరులేని నీ అనుగుకుమారుడైన సుబ్బన్నకు వారే మంటున్నారో అర్థమయిందా నేలతల్లీ !

ఎన్నిదెబ్బలుకొట్టారు, వాళ్ళూ దేవతలయిన పోలీసులూ ! నీ సుబ్బ న్నకుతిండిఉందా ? వంటినిండా పడినగాయాలకూ, ఆ గాయాలవల్లా, పైకి

గాయాలుకాకుండా కమిలిపోయిన దెబ్బలవల్లా వచ్చిన జ్వరానికీ మందు ఉందా, మాకుఉందా నేలతల్లీ ?

మేజస్ట్రీటుకోర్టులో కేసుపెట్టారా ? ఆకేసు జరుగుతుండగానే, ఆగిన్నె-ఆ వెండిగిన్నె యజమానురాలు జాగ్రత్తకోసం ఇనప్పెట్టెలో పెట్టి ఆవిషయం మరిచిపోయిందా ? అది మళ్ళీ కనబడిందా, ఆ విషయానికి ఆ ఇల్లాలు ఒణికి వెండిగిన్నె దొరికిందని మేజస్ట్రీటుగారికి కబురుపంపిందా ? అయ్యో నేలతల్లీ ! సుబ్బన్నధర్మం నీకుతెలుసును.

తాముచేసిన అన్యాయానికి తలెత్తుకుతిరిగిన ఆమాలిక్ హృదయంలో ఇంతసీసం ఉండేమో ? సీసంఉన్నా నయమేతల్లీ మనుష్యుల తెలివితనపు రాక్షసత్వం ఉంది. అది నిజం !!

౪

ఓ నేలతల్లీ ! సుబ్బన్న ఆ యజమాన్ణి వదలివడిచి, నడిచి బొంబాయి చేరాడూ ! బొంబాయిలో కొందరు కూలీల ధర్మమా అని ఓ మిల్లులో చేరాడూ ! ఆ మిల్లులో ఎన్నిగడబిడలు. ఆమిల్లు కొందరి ధనేశేశుల కడుపులదా ? వాళ్ళు ఈ కూలీకీటకాల ధనమానప్రాణాలకు అధికారులాతల్లీ ! నీబిడ్డడుసుబ్బన్నకూ అదేగతి ! పనిచేయడానికి చీమకూ కూలీకి ఆతనికడుపు గుప్పెడా ! తల్లీ ఇదామీకాపరం. అతడు ఏవీధిలోనో ఏనాలుగంతస్తులమేడ ముంగో నీ ఒడిలోనే పడుకుంటాడు. ఏ రెస్టారెంటులోనో ఇంత రొట్టె తింటాడు.

ఓ, నేలతల్లీ ! ఒకనాడు సుబ్బన్న ఇంకో కూలికుటుంబంతో స్నేహం చేశాడా ? వాళ్ళూ హైదరాబాదువాళ్ళేనా ! అవును నీలో ఉండే గమ్మత్తే అది. నీ హృదయంలో ఏభాగంలో ఉన్నవాళ్ళు ఆభాగంవాళ్ళతో కలిసి మెలిసి ఉంటారుకాదూ !

ఆకూలీ కుటుంబమూ పల్లెల్లో అనేక రకాల కూలిచేసి చిరిగిన గుడ్డలుకట్టుకొని, వీలయితే అజాంబాయి గల్లీలలో ఏనల్లాకిందో స్నానం చేస్తారు. తల్లీ వాళ్ళూ నీవాళ్ళేనటమ్మా ! ఆకుటుంబంవాళ్ళు సుబ్బన్నను దగ్గరకు తీశారు. ఏతల్లి, ఏతండ్రికి, పెండ్లిధర్మంలోనో, పెండ్లికి మించిన కామమహాధర్మంలోనో కన్నసుబ్బన్నకు కాస్త మెదడు ఉందిసుమా? కళ్ళ కాంతి కొంచెం నిశితమే !

ఆలాకాలంలో చుక్కానిలేని పడవలా కొట్టుకువెళ్ళే సుబ్బన్నకు. ఆ ఇంకో నేలకుటుంబంలో ఓచుక్కాని " ఓచుక్క; ఓ చక్కనిచుక్క; తలవంపుల, వాలుగన్నులవీధి కూలీమిఠారి ; ఆ మేడల్లో ధనకుటుంబాలకు పనిచేసే వయ్యారి అతనికి నేస్తంఅయ్యిందా ! నేలతల్లీ నీ సుబ్బన్నకప్పుడా నువ్వు లోకానికిప్రసాదించిన సుగంధాలు, సౌందర్య స్వరూపాలు హృదయానికెక్కాయా ?

ఓ. నేలతల్లీ కల్తీలేని ప్రేమ నీ సుబ్బన్న హృదయంలో ప్రవేశించిందా వాళ్ళిద్దరూ లోకంలో మానవులందరికీ ఉన్న జంటధర్మం నిర్వర్తింపసాగారా? నేలతల్లి నువ్వు వాళ్ళ ఇద్దరిమహదానందమూ. ఓర్వలేని మానవకఠినత్వం కళ్ళకగబడకుండా చీకటిని, చాపతీ ఇసుక అని, సందని, తూమని, పార్కని ఆ మహానగరంలో వారికోసం సృష్టించావా తల్లీ !

ఆ సుబ్బన్నకు, సీతకు ఉన్న పవిత్రమైన ముట్టరికం సీత తల్లీ తండ్రీ గ్రహించారు. అది వాళ్ళిద్దరూ కోరిందే కాదూ, నేలతల్లీ! ఓ మంచిరోజున వాళ్ళిద్దరకు పెళ్ళిఅని మూడుముళ్ళూ వేయించారా తల్లీ!

సుబ్బన్న సీతప్రేమలో లోకాలు అవరించాడా! అతనిహృదయమూ జ్ఞానమూ, మనస్సూ పువ్వులులా వికసించాయా నేలత !

౨౪

ఓ నేలతల్లీ- ఏముందులోకంకోసం సుబ్బన్నసీతలు సూర్యోదయం చూస్తూ మలబారు కొండమీద నిలబడ్డారు?

నువ్వు ఆబంగారు ఎరుపుల సూర్యకిరణాలు నీవు ధరించిన వస్త్రం కాగా ఆ నీయొక్క ఇద్దరిబిడ్డల ఆనందమూ చూస్తూఉన్నావా? వాళ్ళిద్దరికి ఈ నీదేశానికి సంబంధం వాళ్ళు ఇక్కడ పిలాగో బ్రతకడమేనా? ఈ రాజ్యంలో వాళ్ళకుభాగంలేదా? ఈ దేశంసొమ్ములో ఈదేశంలో ఉద్భవించేపంటలో, ఈదేశంలో రూపంపొందేవస్తువులలో వారికి భాగంలేద ?

వారిద్దరూ చూచే ఆసూర్యబింబంలో వారి భవిష్యత్తును ఏమిచూచారు! వారిద్దరిచెమటా, వారిమురికిగుడ్డలు, వారికివచ్చే గట్టికష్టాలు స్వచ్ఛనమై దుఃఖాలూ, అమృతము రంగరించిన ఆనందాలూమాత్రమే వారి ఆస్తిపాస్తులా నేలతల్లీ !

ఆరాత్రి సుబ్బన్న సీతను, ఆబట్టలమిల్లు వారు కట్టించిన పేటలో వాళ్ళువంతుకువచ్చిన ఇంటిలో గట్టిగా [నిన్ను కౌగిలించుకునే ఎండలా]

వెన్నెలలా గాలిలా కౌగిలించుకొన్నాడా? నిన్ను గాఢంగా చుంబించే వానలా సుబ్బన్న సీతను ముద్దుపెట్టుకున్నాడా? ఆరాత్రి సీతమ్మగర్భంలో సర్వదేశాలకూ మకుటంకాబోయే నీ భారతీయ దేశానికి నిజపౌరులలో ఒకడు కాదలచుకున్న ఇంకో చిన్న సుబ్బన్న అవతరించాడా? నువ్వు ఉప్పొంగిపోయావా?

సుబ్బన్న తను చుట్టూవున్న అర్థంకాని ఏవో ఇనపగోడలు పగలగొట్టాలన్న ఆవేదనపడేవాడా నేలతల్లీ? అందుకు ఆతనిలో బాంబు శక్తి విజృంభించగలదా?

మిల్లులో యుద్ధావసరాలకు తగినట్లు కూలీలకు కూలీ సరిగా ఎక్కువ చేయలేదూ, అందుక నాయకుడు కూలీలసభ చేశాడూ, ఆ సభలో సుబ్బన్న అంత అద్భుతంగా, మహావేగంతో, గంగానదిలా వర్షవాయువులా మాట్లాడుతూంటే నువ్వు నీపుత్రునివిని ఎంత ఆనందించావు?

కూలీలు దేశానికి రక్షఅన్నావా సుబ్బన్నా! విమానాలు, టాంకులు, రైళ్లు, ఓడలు, బాంబులు, తుపాకులు, వస్త్రాలు, సామానులు, కాగితాలు కలాలు, మేడలు, మిద్దెలు, గోడ్లు, మోటార్లు తయారుచేసేవారు కూలీలు వారుమాత్రం బ తకఅక్కరలేదూ అన్నాడా సుబ్బన్న, సీత తన వయసు కాని గంభీరవచనాలకు ఆనందంతో ఊగిపోయిందా కూలితల్లీ.

యజమానులు కూలీలకోర్కె పాలించరో, కూలీలందరూ సమ్మె చేశారా? అందుకు నీబిడ్డడు ఒక ముఖ్యనాయకుడా నేలతల్లీ! అతన్ని అరెస్టుచేశారా? ఆరోజు సీతమ్మ కుంగిపోతే, నువ్వేకాదు అపరిమితమైన ధైర్యంచెప్పి, ఆ బాలను వీరబాలికను చేశావు?

సుబ్బన్నను వదిలివేయడానికి కారణం దేశనాయకులు కొందరు మిల్లు యజమానులతో రాయబారాలు సలపడంవల్లా నేలతల్లీ !

సుబ్బన్న జీతమూ వృద్ధిఅయింది. సీతమ్మ జీతమూ వృద్ధిఅయింది. నేలతల్లీ, అప్పుడుమాత్రం నీకు తృప్తిఅయిందా ?

ఆ ఆదివారం నీపుత్రుడు సుబ్బన్నా సుబ్బన్నహృదయమూ, ప్రాణమూ, ఆత్మఅయిన సీతా రైలెక్కి జుహూ గాంధీమహాత్ముణ్ణి దర్శించడానికే వెళ్ళారుకాదూ !

ఆ స్వాతంత్ర్యపరావతారాన్ని చూచి నమస్కరించి, అక్కడ సముద్రంఒడ్డున సాయంత్రంకూచొని ఒకరదగ్గర ఒకరుగా ఇద్దరూ ఒకరుగా సీతమ్మ గర్భంలో భావిభారతపురుషుడైన సుబ్బన్న ద్వితీయరూపం నృత్యం చేస్తూఉండగా— ఇద్దరూ— ఆకాశం— చుక్కలూ— సముద్రతీరాలు— భవిష్యత్తు భారతీయమానవుల హృదయప్రళయం దర్శిస్తూ కూర్చొని ఉన్నారుకాదూ? వారిద్దరినీ ఆ రాబోయే మూడవవానిని నీ ఒడిలో ఉంచుకొని నేలతల్లి ! చిరునవ్వుతో నవ్వావా !

ఇంకో కొత్తరోజు ఉదయిస్తుందికాదూ ?



# పిల్లంగ్రోవి

## ౧

ఆ బాలకుని పిల్లంగోరు పొలంగట్టులు, చేలు, కాలవలు, కొద్దిదూరాన ఉన్న కొండలు నిండుతూ ఉన్నది.

ఆతనికి రాగజ్ఞానంలేదు! ఆతడు స్వరవిద్య నేర్చుకోలేదు. ఆతని గురువులు కోకిల. తుమ్మెద, సెలయేరు ఆవుల అంభారవం చేలమీదనుంచి తేలిపోయే మలయబాలకుడు, ఉరుము, కీమరాయి, లవంగిపిట్టలు.

ఆతనికి ఉన్న జ్ఞానమే గాంధర్వము. ఒకస్వరం ఇంకోస్వరం శృతి చూస్తాడు. ఆతని ఊపరే లయ! ఆలయలోంచి వచ్చినతాళాలు మూడే, ఆది, ఏక, రూపక తాళాలు.

ఆతడు సంకల్పించిన గీతాపథకాలు విచిత్ర మూర్ఛనలు.

## ౨

గొడ్లకాపు కస్తివాడు, తొమ్మిదేండ్ల ఈడువాడు. చలిగిన్నన్నం గంజీ ఉప్పుచేప నంజుకుంటూ మెక్కి, ముంతలో గంజివన్నం పెట్టుకొని, ఉప్పులో ఊరవేసి ఎండబెట్టిన మామిడికాయబద్ద కంచమూ మూటకట్టుకొని గేదెపై స్వారీ అవుతూ ఏటిగట్టుకు వస్తాడు.

ఆతని సింహాసనం వేపచెట్టునీడ, ఆతని పరివారాలు పశువులు. ఆతని ఆయుధం పిల్లంగ్రోవి !

ఆతని పట్టుపీతాంబరలు చినిగినగోచీ, చినిగిన తలపాగాగుడ్డ! వాన వస్తే రెండుగేదెల్ని నిలబెట్టి వాటి అడుగున కూచుంటాడు. ఏరు పొంగితే గేదెలమీద దాటుతాడు, ఆతని రక్షక భటులు ఆవులు గేదెలు. పెద్దపులి నైనా దూరాన నిలబెట్టుతాయి.

3

పశువులతో మేతబయలుకురా గానే 'పొండప్రా 'అని చెట్టుకింద మకాంవేస్తాడు. ఆటలు ఆడుతాడు, పాటలు పాడతాడు.

పిల్లంగోవి తీసి భువనమోహనంగా వాయిస్తాడు. ఆ పాటలను సాహిత్యం ఆతని హృదయమే!

ఒకసారి అతనిపాట ఎగిరి గంతులువేస్తుంది. పూవులు పూస్తుంది. చిరునువాసనలు వెదజల్లుతుంది. చిటి చిట్టి ఊటలా జల జల లాడుతుంది.

ఒకసారి ఆతనిపాట లోకాన్ని చూచి ఆశ్చర్యం పడుతుంది. తెల్లబో తుంది, వణుకుతుంది.

ఒకసారి అతనిగీతం ఏదో వెదుకుతుంది ఆకాశాన్ని పారకించి చూస్తుంది. భూమిలోతులు చొచ్చిపోతుంది నదీ నీరాంబుకణాలు లెక్క బెడుతుంది.

మరి ఒకసారి కంటనీరు నింపుతుంది ఏదో ఎరగని భయంచే ముడు చుకుపోతుంది, ఆకలై కుమిలిస్తుంది, మానవుని సర్వబాధలై విలపిస్తుంది.

పల్లంగోవి.

ఇంకొకసారి అన్నీ తెలిసిన జ్ఞానిపద్మంలా యోగము డిపహిస్తుంది గడ్డిపూవుల నివేదనలిస్తుంది. ఏటిలోని చేపలులా లోతులు కనిపెట్టుతుంది.

ఆ బాలుడు పిల్లంగోవి పెదవులతో చుంబిస్తూ తన సృష్టితనకే తెలియని బాలుడౌతాడు.

౪

ఒకరోజు ఆ పక్క పొలంలోనుంచి పొలంకూలీ బాలిక ఒకతె ఆతని పాటదారినే ఆతన్ని వెతుక్కుంటూ వచ్చింది.

ఆ బాలిక ఎనిమిదేళ్ళబిడ్డ! ఆతనికి ఎదురుగా ఆతని పాటవింటూ కదలకుండా కూరుచుంది.

ఆమెవచ్చి ఆతని రాజ్యాన్ని హరించలేదు, భాగించలేదు.

ఆమె ఆతనిరాజ్యంలో, ఆతనిపాటలో. ఆతనిలో భాగమయింది.

ఆమెకూడా ప్రతిరోజూ ఆతడు పాటపాడేవేళకు వచ్చి ఆతని ఎదురుగుండా కూచునేది.

ఆ బాలికను ఓ చింపిగుడ్డ ముక్కలు ఆగుడ్డ ఆమెనగ్నతను పూర్తిగా కప్పనేలేదు. ఆమె చేతికి రెండుగాజు గాజులు. ఆమెకాళ్ళకు రెండు అల్యూమినియం కడియాలు.

ఆ బాలునిమోము సూర్యబింబం అయితే, ఆమె మోము ఆ పక్క చెరువులోని పద్మమే!

## ౨౮

ఒకదినాన అతడు పిల్లంగ్రోవి వాయిస్తున్నాడు. లోకం అంతా సమ్మోహనమై ఆతని పాటవింటోంది. ఆబాలిక ఆపాటేఅయింది.

ఇంతలో లోకాలు బద్దలుచేసే ధ్వనితో ఆకాశంలో ఏదో పెద్దపక్షి.

ఆ చప్పుడుకు అదిరిపడి ఆ బాలకుడు పిల్లంగ్రోవి ఆపి గభాలున భూమిమీద పడిపోయాడు, ఆ బాలిక దద్దరిల్లి హోరుమంటూ అతని పక్క వాలి ఆతన్ని కౌగలించుకొంది.

ఆ రాక్షసిపక్షి వెళ్ళిపోయింది. కొంతసేపటికి అపసికందు ఇద్దరూ లేచి తమచుట్టూ అంతా కళ్ళనీళ్ళతో పాఱచూచారు.

ఆతని ఆవులు గేదెలు నిశ్చలంగా మేస్తున్నాయి పువ్వులు వికసించి ఉన్నాయి, వేపచెట్టు ఆవరించే ఉన్నది. సెలయేరు జల జల ప్రవహిస్తూ ఉన్నది.

ఆతడు ధైర్యవహించి పిల్లంగ్రోవి తీసి మళ్ళీ మూడు పవిత్రస్వరాలు కలిపాడు. ఏమీవిశ్వం అన్నట్టుగా ఒక్క మూర్ఛన వచ్చింది. ఆ బాలిక ఆతన్ని కౌగిలించుకునే ఉంది.

దూరంగా యూరపులో యుద్ధం జరుగుతున్నది. జపాను పిరల్ హార్బరుపై విరుచుకు పడింది.

ఆ బాలకుడు అదటుతీరి రోజూ ఆకాశంలో వచ్చిపోయే ఆరాక్షసి పిట్టలమోత్రకు [illegible] కలిపి ఒక కొత్తమూర్ఛన మ్రోయించాడు. ఆబాలిక చిరునవ్వుతో అతనిపాట పరవశయై విన్నది.

---

సమాప్తి.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TP/A106B111 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | Good |